రోగారిష్టదుర్భిక్ష తస్కరబాధాదులు వొరయక సుఖంబుండెనంత॥ మ॥ తన
తాత్పర్యమెఱుంగనొక్క తఱి సత్రాజిత్తునా రత్నముం। దనకిమ్మంచు మురారి
గోరఁ ధనలుబ్ధస్వాంతుఁడై యాతఁడీ। బనిమేమయ్య బహుప్రయత్నంబునఁ సంపా
దించుకొన్నట్టి నా। మణి నీకిమ్మని కోరంగ కాదెదవు నీమర్యాద గానంబడెన్॥ ఇది
నీకర్పణమే నొనర్చునది లేదీకున్న నన్నేమిచే। సెదుపొమ్మంచు నరత్నమీయక జ
గత్సేవ్యున్ జగత్ప్రాణునబ్జదళాక్షున్ మదిసంశయింపక దిరస్కారంబుగా
వించెదు। న్మదమోహాస్పద చిత్తవృత్తులు చితప్రస్తావముల్ నేర్తురే॥ గీ॥ అంత
నొక్క సమయమందు సత్రాజిత్తు। సోదరుఁడు ప్రసేనుఁడాదరమున। వేటకేఁగఁద
లఁచి వేగనాఖేట। లీలానుకూల వేషమావహించి॥ ఉ॥ సంతతవైభవోన్నతిప్రశ
స్తిగరమ్యవిభావృతాఖిలా। శాంతము ప్రత్యహార్పిత మహారజతోత్కర మోది
తాశ్రిత। స్వాంతము నా శమంతము వెసన్ గళమందు ధరించి ప్రాగ్దిశా। భ్యంతరదీ
ప్యమానరవియట్లు మహోజ్జ్వలుఁడౌచు వేడుకన్॥ శా॥ ధారాపంచకధావనాన్వి
తముప్రోద్యన్మారుతాతిత్వర। ప్రారూఢంబు మహోన్నతంబుభయపార్శ్వాబ
ద్ధకోదండతూ। ణీరాస్త్రంబు మనోజ్ఞరూపసుషమానీకాశమా ఘోటకం। బా
రోహించి ధృతాసియై సనియె ఘోరాగ్రాటవీవాటికిన్॥ చ॥ చను నెడ నా ప్రసేను
నకు సాంద్రరజోభ్రిపదాశుగాద్యనం। తనిబిడ దుర్నిమిత్తములు తత్పరబాహ్యా।
మునందుదోచెదో। చినమృగయాపరివ్యసనశేముషి నక్కొరగాము లెంచకేపున
జనియెం గ్రియారతుఁడు ముందరిగోర మెఱుంగనేర్చునే॥ మ॥ చని ప్రోలంగని యెం
బ్రసేనుఁడు మిథస్సమ్యగ్విరోధోగ్రభం। డనకార్యోద్భటపుండరీకగజగండక్రోడభే
రుండవా। హనవిద్వేషితరక్షుభల్లుకమృగేంద్రాష్టాంఘ్రిజాతానవ। ధ్వనినాదా
ర్భటిదీర్ణఖస్వగకాంతారంబు గాంతారమున్॥ వ॥ కనియబ్బెడిదంపుటడవి
జొచ్చియచ్చటజటులమృగవ్యక్రీడారటత్పిల్లపల్లవాధరీభుజాదండమండిత కో
దండశింజినీటంకారప్రతి స్వనదఖర్వోర్వీధరా గ్రస్థలీఘుమంఘుమార్భటికా
పూర్వకపరిపతితనిర్ఝరధారాపతనవేగ ఖసీభూతశిలాతల భయంకరధ్వా
నభయాకులితయుగ పద్ధాపత్రౌంచకారండవ చక్రాంగరథాంగముఖనిఖిల
జలవిహంగమగరుత్పటపటాత్కారా దభ్రవిభ్రమవిభ్రాజిత సరోవరంబులు
ను। ప్రభూతప్రపాతమధుమక్షికా ఘటితపరిణతమధురమధు చ్ఛత్రనిర్గళితా

రో గారిష్టదుర్భిక్ష తస్కరబాధాదులు బొరయకసుఖంబుండెనంత॥ మ॥ తన తాత్పర్యమెరుంగనొక్క తరిసత్రాజిత్తునారత్నముం। దనకింమంచుమురారి గో రథనలుబ్ధస్వాంతుడై యాతడీ। బనియేమయ్య బహుత్ర వంబెనసి సంపాదించుకొన్నట్టినా। మణినీకిమ్మని కొంచకాడెదవు నీమర్యాదగానంబడెన్॥ఇది నీకర్పణమే నొనర్చునది లేదికున్న నన్నేనిచే। సెదుపొమ్మంచునురత్నమీయకజగత్సేవ్యున్ జగత్ప్రాణునబ్జదళాక్షున్ మదిసంశయింపక దిరస్కారంబుగా వించెదు। స్మదమోహాస్పద చిత్తవృత్తులు చితప్రస్తావముల్ సేర్తురే॥ గీ॥ అంత నొక్కసమయమందు సత్రాజిత్తు। సోదరుడుప్రసేనుడాదరమున। వేటకేగ దలచి వేగనాఖేటలీలానుకూలవేషమావహించి॥ ఉ॥ సంతతవైభవోన్నతిప్రశస్తిగరమ్యవిభావృతాఖిలా। శాంతనుబ్రత్యహార్పిత మహారజతోత్కరమోదితాశ్రిత। స్వాంతమునాశమంతమువెసన్ గళమందుధరించిప్రాగ్దిశా।భ్యంతరదీప్యమానరవియట్లుమహోజ్వలుడౌచు వేడుకన్॥శా॥ ధారాపంచకధావనాన్వితముబ్రోద్యన్మారుతాతిత్వర।ప్రారూఢంబుమహోన్నతంబుభయపార్శ్వబద్ధకోదండతూ। ణీరాస్త్రంబుమనోజ్ఞరూపసుషమానీకాశమాఘోటకం। బారోహించి ధృతాసియైమెసనియెఘోరాగ్రాటవీవాటికిన్॥చ॥చనునెడనాప్రసేనునకుసాంద్రరజోభ్రమదాశుగాద్యనం। తనిబిడదుర్నిమిత్తములుతత్పరబాహ్య। మునందుదోచెదో।చినమృగయాపరివ్యసన శేము షినక్కొరగాముటెంచ కేపునజనిమెంగ్రియారతుడుముందరిగోర మెరుంగనేర్చునే॥ మ॥ చనిప్రోలంగనిమెంబ్రసేనుడుమిథస్సమ్యగ్విరోధోగ్రభం।దనకార్యుద్భటపుండరీకగజగండక్రోడభేరుండవా।హనవిద్వేషితరక్షుభల్లుకమృగేంద్రాష్టాంఘ్రిజాతానవ। ద్యనినాదాస్ఫుటదీర్ణఖస్ఫుగగకాంతారంబుగాంతారమున్॥ వ॥ కనియచ్చోడిదంపుటడవిజొచ్చియచ్చటజటులమృగవ్యాక్రీడారటత్ప్రిల్లపల్ల వాధరీభుజాదండమండిత కోదండశింజినీటంకారప్రతి స్వనదఖర్వోర్వీధరా గ్రస్థలీఘుమంఘుమార్భటికాపూర్వకపరిపతితనిర్ఝరధారాపతనవేగ ఖనీభూతశిలాతల భయంకరధ్వానభయాకులితయుగ పద్ధాపత్రైౌంచకారండవ చక్రాంగరథాంగముఖనిఖిలజలవిహంగమగరుత్పటపటాత్కారా దభ్రవిభ్రమవిభ్రాజిత సరోవరంబులను। బ్రభూతప్రపాతమధుమక్షికా ఘటితపరిణతమధురమధు చ్ఛత్రనిర్గళితా

క్షుద్రక్షౌద్రరసస్రవణమాద్యదచ్ఛభల్లభల్లోపమాననఖరనఖరవిదళితవల్మీకరుంధ్రరంధ్రోద్గతనిర్నిద్రకాద్రవేయనికాయకబళనోన్మత్తకేకిలోకకేకారవవ్యాకులితదరీపరిసరప్రవర్ధమాన మాలతీమాధవీమల్లికాదివల్లీ మతల్లికావేల్లిత మంజుకుంజపుంజంబులును। సమంజసప్రభంజన ప్రసారాసకృత్ప్రస్ఫురపరస్పరసంఘర్షణరణత్క్రియా భీషణఘోషణాభ్రంకషసాలతాల మాలూరరసాలాదిసాలషండమండలంబును। స్వస్వప్రవర్ధితతృణధ్వజవ్రజ నిర్మూలన ప్రాప్యమానతదగ్రపచేళిమధాన్య గ్రహణనిమిత్తోచాత్తఘుర్ఘురనిర్ఘోషణపురస్సరాతిదారుణ రణకరణస్తబ్ధరోమస్తోమాన్యోన్యఘట్టనప్రభగ్నదంష్ట్రాంతరనిర్ముక్తముక్తాఫల పరంపరాతరంగిత శృంగాటకంబులును। బల్లవితసల్లకీతరుతల్లజభంజన పరోన్నమితహస్తప్రశస్తవిన్యాస విలాసధురంధరసింధురబంధురఘీంకారసంకులావరణాంకురితోద్వేలశాద్వలతృణభక్షణాక్షీణహరిణగణకంఠలుంఠనపరిస్రవదస్రధారాసంసేవనమాంసలప్రచండపుండరీకప్రకాండసముద్భటఘుటఘుటధ్వని ఘూర్ణమానసానువులును। సందర్శించి యందందగ్రందుకొను గజగవయ గండభేరుండ శరభసైరిభ క్రోడప్రముఖమృగంబులను ధనుర్గుణంబు సలిపియుశంఖంబుబూరించియు జేదశిలివిసరియునడిచంబు ఝళిపించియు దురంగంబుబరపియు ననలయంత్రంబుజూడియు జోపువెట్టిన॥ గీ॥ నిదురలుడుగునవియు బెదురొందునవియు। మత్సరము లెడలునవియుజతలువీడు। నవియునగుచునెలవులందుండిభోరున। నఖిలమృగచయంబులలుకవెడలె॥ క॥ ఆసమయమునప్రసేనుం। డాసకలమృగాళిడాసిహర్షోత్కర్షోల్లాసాత్ముడగుచువేగన్ । భాసురమృగయా విహారపారాయణుడయి॥ క॥ గండంబుపజ్జబరువిడు। గండంబుప్రసేనుడరసిగడియదునీకీ। గండంబనిదునిమెమపోలా। ద్గండంబుగవెసప్రచండకాండ ప్రహతిన్॥ క॥ దారుణఘీంకృతిసీఘను। దారుణదృష్టియయి పయికినరుదెంచుమహా। వారణముగ్దునుమాడెన । వారుణపుంఖానుపుంఖవరశరనిహతిన్॥ క॥ గంధర్వులభినుతింపగ। గంధర్వనుబరపిఘోరకాననధావ। ద్గంధర్వముదునిమెనుయా । గాంధోర్వాచ్ఛయశుగా తడతులాస్త్రమునన్॥ చ॥ గురువెడుచున్నికుంజమునగారుకుక్రోల్పులిగాంచియొక్కబల్।శరమడరింపనులీల పడిచండతచేనదికాంద్రుమంచు।బి

ట్టరచుచువచ్చి వెండియొకయమ్మిడగానదియుఁ గణింపకే। త్తరపయిబర్వినా
తడువడిఁ గడిమింబాడిచెన్నిడెంబునఁ॥ చ॥ హయమునుగాంచినంతనెమహో
రుషచేనొక సైరిభంబుతద్దయుపదఘట్టనాప్తినిలదద్దరిలంగగిలాచుఁచున్మదో
చ్ఛ్రియగతివచ్చి తద్గురుశరమ్ముల గొమ్ములజిమ్ముచుఁ వడింబయిపడిగూలెద
చ్ఛితకృపాణహతింగులిశాహతాద్రినాన్॥సీ॥ ప్రియకంబుగెడపె దోఃప్రియక
లంబంబున శంబరస్థితిజంపెశంబరంబు। నచ్ఛభల్లముద్రుంచె నచ్ఛభల్లంబున
రంకుబోకార్చె నిరంకుశగతి। గందళిదునిమెహ్వాతఁగందళితాసక్తశల్యంబుదూ
టాడెశల్యయుక్తి। సృమరంబుధృఢలక్ష్యసృమర దృష్టివధించెఖడ్గంబు డెగ
టార్చెఖడ్గధార। శరభగరుదంబకంబునశరభమేసె। గదలిదూటాడెశరహతి
గదలిపడగ। రామమునగల్చె శౌర్యాభిరామపటిమ। గోలమునుగూలిచెలకో
రికోలనతడు॥ క॥ యీకరణిమారిమసగిన। జోకందనకెదురులేని శూరత్వము
చే। నాకానప్రసేనుండ। స్తోకమృగావళులదునిమితూటాడునెడఁ॥ సీ॥కల్పాం
తరుద్రుడకాఁతార విహృతిభమృగవరాకృతి జనియించెననగ। సందంద
మందువనానలంబేకమై క్రందుగానొకఁ చోగ్రాలెననగ। నిలప్రసేనునిపాలి
మృత్యువు సామజద్వేషియై మూర్తిభవించెననగ। బాతాళగతఫణీశ్వరహాలా
హాలకీలి పృధివిమీదికినంకురించెననగ।నొకఁ కంఠీరవంబుక్రోధోగ్రమూర్తియ
గుచుగవినుండి వెల్వడియద్రులద్రువ। ఘూర్ణితరఘుర్ఘురధ్వని బొబ్బలిడుచు। శీ
ఘ్రగతిబారుదెంచె ప్రసేనుపైకి॥ వ॥ అత్తెరంగునంబరతెంచు పంచాస్యంబు
గాంచికించిత్తుగొంచకుదంచదవక్రవిక్రమోల్లాసభాసురముఖుండై ప్రసేనుం
డుద్దండభుజాదండతాండవిత కోదండపాండితిమెండుకొన గాండంబునిండగు
ణంబు సారించివేసారకాసారపూరంబున రసాధరంబుగప్పు ఘనాఘనంబు
గండున ప్రచండకాండ ప్రకాండంబులుతండోప తండంబులుగాదుండి వైరి
నిండించిన గండరకవ్రేటులకుదప్ప దాటుచు దప్పనివి కుప్పళించి పెళపెళను
రుమాడుచుగాడినవాడితూపులలెకఁపక గ్రక్కునఁ నకఁఠీరవంబువెగ్గలంపు
టగ్గలికతోడగ్గరు నెడప్రసేనుండఖండతరపరుష శరపరంపరగురియుచు।నపా
రపథాక్రమప్రధిమాధురంధరతానుబంధబంధురంబగు సైంధవంబు సింధు
రపతిపంధికంద నీకనమందొడార ఘౌరితవల్గిత రేచితాదిగమనచాతురింబరప

నకేసరివేసర కెట్లుకుప్పించిననట్లు కుప్పించుచు నెట్లేగిననట్లేగుచు నేమొగం
బయిననామొగంబగుచు బ్రబలపదఖరనఖరకఠోరకుఠారంబుల బ్రహరింపుచు
దురగంబు గిరిగీసినపగిదిగదలనీక వీకంబయింబడి నిష్ఠురతరదంష్ట్రాగ్రంబుల
గంఠంబకుంఠితోత్కంఠంబట్టి నెట్టననట్టిట్టు ఘట్టించిన ఘోట్టాణంబు సంక్షీణిత
ప్రాణంబై క్షోణింబడు నాలోబ్రసేనుండు ధరణికిలంఘించియని వార్యశౌర్య
ధుర్యుండగుచు గదాదండంబున మోదియుగుంతంబున గ్రుమ్మియుబిడెంబునబా
డిచియుగటారున దూటాడియు నెన్నియొనర్చినన న్నియు నెన్నక ఘోటకంబు
గీటడంచి తనపైకడరిననతడు మణిచూడంబగు కేడెంబు హరిచరణ నఖరప్ర
హారంబులకొడ్డుకొని యపరంజిపరుంజు క్రొంజికిలిబాకున గుడియెడమలవిస
రుచు సవ్యాపసవ్య చిత్రగతిభ్రమణంబుల బరిభ్రమించుచున్నాహర్యక్షుంబ
క్షీణరూక్షభావంబున గ్రన్ననబయింబడి నఖకులిశకోటుల నాప్రసేనువాలు
నుంబలుకయు నులినులిచేసిరోసంబున మైకత్తళంబుదుత్తురుమురుగావించిప
డందిగిచి పదంబులనిరికించి శిరంబునదోరంపుకోరలగుత్తుకను త్తరించిక్రొన్నె
త్తురుగటగటం గ్రోలితదీయదివ్యరత్నంబు గ్రహియించియుదగ్రతరాగ్రహం
బున జటులఘుటఘుటధ్వనులిడుచు గడిమింబరచెనంత॥ సీ॥ ఒకకొండనుండివే
రొకకొండమీదికే ఘనుడుదయాస్తాద్యగములదుమికె। గైలాసమునజానుకాం
డప్రహతినే ప్రబలుడు దైత్యోజ్ఝితా చలమగల్చె। బలియజ్ఞవేళనే బల్లిదుండ
మరముఖ్య సభాసదులకు చోద్యంబొనర్చె। శ్రద్ధబ్రదక్షిణత్రయివిశ్వపూర్ణత్రి
విక్రమస్వామికే విభుడుసల్పె। రామకయింకర్యధుర్యతనేమహాత్ముడలఘులం
కాసురులనేకులవధించె। నట్టిధీమంతుడతిశాంతుడధికశౌర్య। వంతుడలజాం
బవంతుండు సంతసమున॥ ఉ॥ స్వస్థితియుక్తశైల దరిసయ్యనవెల్వడి యోగి
సన్నికృష్టస్థవి శుద్ధపుష్కరిణిస్నానజ పక్రియలాచరించిని। స్వస్థనిజాశ్రమాచ
లగుహాంగదియంజనుదెంచుచుండియ। గ్రస్థలిబర్వుదివ్యమణికాంత్యభిసాంద్ర
మునమ్మృగేంద్రముణ్॥ఉ॥కాంచిమృగంబసృక్కలితగాత్రముతోమణితోరయా
ననే। తెంచుచునున్న దెన్నునిదిధీరునాఁకానొక వేటకానిదుం। డించితదీయరత్న
మువడింగొని యేగెడునట్లుగానిచో। జంచదసృక్ఛరీరమును సన్మణియుంగలు
గంగనేటికిణ్॥

క॥అనినిశ్చయించిసింగం।బునుదునిమితదీయరత్నముంగొనజిత్తంబునను
త్సహించితాస।య్యనసింగముసడ్డగించియనికడరుటయుఁ॥మ॥ అదిఘోరంబు
గబొబ్బరిల్లుచును శౌర్యస్ఫూర్తిబెరాజయా।స్వదబాహాగ్రనఖప్రహారములనా
పంచాస్యమున్జంపితద్విదితానర్ఘ్యశమంతముఁ రుచిరదీప్తిచ్ఛాదితాశాంత
ముఁ । ముదమొప్పంగొని జాంబవంతుడరిగెఁ భూభృద్దరీవాటికిఁ॥ క॥ అ
నియిట్లుశౌనకాదుల। కనురతిగథకుందుచెప్ప నాలించిముదం। బునదేలిభవిష్య
త్కథ। ననఘావినుచుమని సూతునడిగిరితపసుల్॥ మ॥ ప్రణుతప్రాభవసంగ
సంగరహతా పారత్రిపూరున్మద। త్రుణదాటప్రబలాంగలాంగలధరాచ్ఛస్ఫార
మాశ్యంఘ్రిభూ। షణితాబ్జాదిభుజంగజంగమవశత్ప్రమ్లోధరభ్రాంతికా।రణ
గోరాజతురంగరంగదురుగో రంటాగ్రహారస్థితా॥క॥కమలముగయనచికురక
రకమలవిరాజద్విలాసకమలకిశోరా।కమలాకరవిశిఖాకర।కమలాధిపబాణనార
కమలత్కృతైనా॥ ఉత్సాహ॥ సకలజాల, కలుషజాల, శకులజాలనిర్జర। ప్రకర
సాల,శిఖరసాల, పనరసాల,వాలపా॥ వకితఫాల, చకితబాల, భయవిఫాల
లోకదా। హకకరాల సద్గరాలయతర్కరాలకంధరా.

గద్య॥ ఇదిశ్రీమత్కవితాచతుర తురగా వెంకయామరవాచి రామ
యోభయకవి ప్రణీతంబైన శమంతకోదంతంబను మహాప్రబంధంబునందు ప్ర
థమాశ్వాసము.

సంపూర్ణము.



శ్రీ ర స్తు.

## ద్వితీయాశ్వాసము.

మశ్రీద్గోరంటాఖ్య గ్రామస్థితవాశిరెడ్డి రామయసుకృతి। గ్రామణ్యాభిప్ర
తిష్ఠిత। సోమేశ్వర దేవవిబుధ। శుభకరభావా॥ తే॥గీ॥ అవధరింపుము శౌనకా
ద్యఖిలతాప। సేంద్రులకు రౌమహర్షణియిట్లుబలుకు। సట్లుభల్లూకలోకేశు
డాత్మగిరిగు। హాంతరాళంబునకు ప్రీతినరుగుడెంచి॥ సీ॥ ఏలలనాలోకధాళధళి
కినోడి హరిణికాతరదృష్టినధిగమించె। నేమహిళాగండధామలీలకు జంకిశశిరేఖ
బహుళకృశత్వమూనె। నేరామచారూరుసౌరందలేకదుర్భరజడస్థితిరంభశిర
మువంచె। నేసతినఖరవిలాసంబు నెనయనోపక తారవెలవెలబారనయ్యె। నట్టిది
వ్యాంగనాతిశాత్యధికరూప। వతికిజాంబవతి సమాహ్వాయకుదనదు। నెనరు
పట్టికికేళికుర్వనముగాశ। మంతకముజాంబవంతుడొనర్చెనంత॥ చ॥ క్షితిదనపే
రిటక్ బ్రతుకుసంహ్వాముజంపియునాత్మరత్నముద్ధతిహరియించె ఋక్షవిభు
డంచుమషృడినట్లుపాటలా। కృతియయివేకనామనువహించుటనాహరిమృ
త్యశౌచని। గ్గతికిమునుంగనేగెననగాజనియెన్ రవిపశ్చిమాబ్ధికిన్॥ క॥ అపరది
శాగామిదినా। ధిపరథహయఖరఖురాహతిక్షుపితాస్త్రాద్రిపృథులగైరికధాతు
వ। రపరాగంబనగసాంధ్య। రాగముబొలిచెన్॥ చ॥ పరగిరిదంభవల్మికముపైక
రుదెంచురవిచ్ఛలాండజేశ్వరుగని భీతిచేదదధివాసముబాసిరయాన పాఱిపక్ష
భృ। ద్దరులకుజేరబాయనసితస్ఫుటిపంక్తులొకోయనంగమే। మరముగబారెనీడల
తిదూరసమావృతరీతిబాఱిచికిన్॥ మ॥ చరమాశాంతవనాంతరోజ్జ్వలకవోష్ణ
ద్యోతదంభోగ్రదు। స్తరదావోద్గతధూమమాలయొ దినాంతగ్రీష్మవేళాంత
దు। ర్భరసంధ్యాతటిదంశుపూర్వనిబిడాభ్రశ్రేణియోహార్య గో। చరసిర్ఛేతిచ
రతరార్చిచ్ఛటయొనాత్మాంబర్వ గ్రాంజీకటుల్॥ చ॥ పతివిరహార్తిమూర్ఛిలినభం
గిపయోజినివాడబారెద। ద్గతిదినభర్తకున్ దెలుప దప్రియతంబ్రియబాసియేగె
నో। జతవిడి హేళిజూడ బడిచక్రమునెవ్వగనేగెకాలసం। గతిరవికబ్బుటన్ ము
దముగాంచెననన్ గుముదంబుశోభిలెన్॥ సీ॥ నటదుమాధవశిరోంతరలురత్సరి
దున్నమద్వారికణపరంపరలనంగ। హరిదంతరాళమన్వరివిపఖ్యికనిశాకుకోటి
బెట్టినగ్రుడ్లనంగ। గగనోపవనమునఘనప్రాంతచైత్రసంప్రాప్తిబూసినసుమప్ర

కరమనగ। సంధ్యార్వపూర్వమైజగముముంచినతమోంబుధి వెల్లిబొడము బుద్బు
దములనగ।ఖరకిరణ దంభదాశాహార్జ కరవిదళిత। బిసరుహాభవాండకువల
యాపీడనోగ్ర। కరటికుంభోద్గళిత మౌక్తికప్రతాన మనగనవతారకాసమూ
హంబులడరె॥ క॥ అత్తరిద్వారకసత్రా। జిత్తాత్మగృహంబునకు బ్రసేనుడురా
మిక౯। జిత్తమునదీనికేమిసి। మిత్తంబని తద్విచారమేయుండగుచుక౯॥మ॥ పసు
లూరంబడిమెన్నిణుకుఁరనిదోపన్నాగెఖద్యోతముల్ మసకంబారెదిశలఁదో
రపుటిరుల్ క్ష్మోనిండె గూళ్ళన్విహాయసముల్సేరె। నుడుల్జ్వసించెను నభంమ్మంతం
తకుంరాత్రిపెం। పెసగ౯జొచ్చె బ్రసేనుడింటికకటా యేతెంచడయ్యెన్గదా॥
సీ॥ ఇంతరాతిరివైనకాంతారమందుండియే తెంచకుండుట కెద్దియొకో। ఘో
రవిపత్తుచేకూర నౌనస్లైన వేటయందెటువంటిభీకరోగ్ర। మృగములనేనియు
మేకొనితఁటాడుబలుపోటరియకాకవానిచేత। మడియునాతఁడుగాడు మత్ప్రి
యానుజుశక్తిమదినేనెరుంగనామరిదలంప। నెవ్వఁడోయొకరుఁడుదురాత్ముడవ్వ
నమున। కస్మదనుజుడుజను దెంచుటాత్మనెరిగి। రత్నహరణేచ్ఛగహనాంతరము
నకేగి। ధృతకపటయుక్తినతని వధింపబోలు॥ వ॥ అనియోచించిగ్రక్కునబ్ర
త్యుద్గతపూర్వస్మృతియైయాసత్రాజిత్తుండంతరంగంబున॥

చ॥ వెనుకటికొక్కనాడుమణివేడినచోదనకీనొసంగకుండినపగనాట
గోలెదనడెందమున న్వహియించియున్నవా।డనయమువాసుదేవుడిపుడాతడె
నాయనుజు న్వనంబునన్దునిమి తదీయరత్నమునుదొంగిలినాడిది నిశ్చయంబు
గ౯॥ ఉ॥ ఎంతకువచ్చెకృష్ణుడిదిమేమియధర్మము రత్నమీనిదు। ర్దాంతమనోవి
రోధమునుదాలిచికాలము వేచియుండివ। న్యంతరసీమనాయనుజునోర్చిమణి
న్హరియించెగాయయో। యింతటిదుష్టులున్నికనెట్లి తరుల్ బ్రతుకంగలారి
లక౯॥ క॥ మానకమణిగైకొనిన। న్మానెంగరుణా విహీనమతియాచుమదీ।యా
నుజునారకదునుమెక౯। దానకటాదీననేమిదనకులభించెక౯॥ క॥ అనిసత్రాజిత్తు
డుతన। యనుజుడుహరిచేతమడిసె। నని వెసజిత్తంబుననిశ్చయించిఘోరున।నను
జున్గురియించియిట్టులని విలపించెక౯॥ క॥ పరమోత్సవంబుతోఁభీ। కరమృగయా
ఖేలనంబుగావింపంగా। నరుదెంచికృష్ణుడనుసు స్థిరమృత్యువుపాలబడెనశించి
తెతండ్రీ॥ ఉ॥ చారుశమంతకాంశుతతిచంచలగాధృత దోశ్శరాసటం।కారము
గర్జగానిబిడకాండపరంపరచే మహామృగ। స్ఫారదవాగ్ని నార్పుచు నెసంగుబ్ర
సేనఘనాఘసంబురూ। పారిచెగాయయోజలరుహాక్షుసమీరముదాకిదైవమా॥

ఉ॥ ఎక్కడికేగినన్మరలనెప్పుడువత్తువకోయటంచులో । సృక్కుచుతావకాగతికైజూచుచునుండగవచ్చి భక్తితో। మ్రొక్కకపుంగలించుకొనిమోదితునన్నొనరింతువిప్పుడీ। వెక్కడనుండివత్తువనియేనెదలోదలతున్నహోదరా॥

సీ॥ పరుషతపోదీక్ష దరణినారాధించి కాంక్షనేలశమంతకముబడశితి బడసిననేమియన్నడు రానిజలజాక్షుడేటికి మనయింటికేగుదెంచె। నేగుదెంచి ననేమిబాగుగావనితల్ప కాశమంతకమేలనాతడడిగె। నడిగినవెంటనే నధికవైరముబూనబడదనిమణినేల నిడగనైతి। నిడకయుండిననేమినేడడవికేల। నదియథరియించియరిగితీ వరుగుజాడ। మేలశౌరికిదెలిసిహా యింతచర్య। మొనయుటత్వదీయ మృతికిగాబోలుననుజ॥ వ॥ అనిబహువిధంబుల విలపించివెండియు॥ ఉ॥హాయనుభవ్యరూప నివహాయనునర్గళ దృశ్యమానబా। హాయనుసాంద్రవిక్రమవహాయనునిర్జిత విద్విషత్సమూ। హాయనుధైర్యదైవత గృహాయనునాశ్రితబాంధవానుమో।హాయనుసన్మనోజలరుహాయనుసువ్రత ఘూర్వహాయనుజ॥ ఉ॥ నాయనుసంభవాయను ఘనాయనుదూరిత మత్తచిత్తమా। నాయనుచంద్రబింబ వదనాయనుకోవిదవర్ణనీయదా । నాయనునాతజ్ఞసంస దవనాయనుకోమలవాక్ప్రకాశమా। నాయనుసద్గుణౌఘభవ నాయనుయాదవ నందనాయనుజ॥ఉ॥ రాయనునన్నుబాయ నగురాయనునామొర నాలకింపవే। రాయనుగూర్మిగన్గొనుము రాయనుబల్కన బల్కవీవదే। రాయనునంకపాళినిడరాయను నాప్రియసోదరాయనుజ॥వ॥ ఇవ్విధంబున సత్రాజిత్తుపుత్రమిత్రకళత్రాద్యఖిల కుటుంబయుతుండై ప్రసేనుగురించికన్నీరు మున్నీరుగా భోరుభోరునవాపోవుచున్న నారోదనధ్వానంబువిని పౌరులందరం దులకుంబరదెంచిసందడులం జడియుచునిదియేమికారణంబని యడిగిననయన కోణంబులదిగజారునశ్రుధారల దుడిచికొనుచు నెల్లరువినవప్పౌరముఖ్యులతో సత్రాజిత్తుండిట్లనియె॥చ॥ వెనుకటికొక్కనాడు నరవిందదళాక్షుడు మాగృహంనకుజజనువునవచ్చి నాకినుడొసంగుశమంతక మిమ్మటన్ననే। దనకదియీకయుండిననదామదినామెడ నాటగొలెబా।యనిపగబూనిరత్నహరణార్థముకాలనిరీక్షితాత్ముడై॥ ఉ॥ మామకసోదరుండల శమంతముకంధర దాల్చినేడువన్యామహీవేటగ్రుమ్మరగ నాతనిజంపిమణిన్హరించెనే। నేమనిచెప్పువాడనిక కృష్ణుడుమమ్మమనంగనియ్యడ । య్యోమిముబోంట్లువిన్నచన కొచ్చమటంచు దలంచడేమొకో॥ ఉ॥ ఎంతకువచ్చెకృష్ణుడిది యేమియధర్మము రత్నమీని। దుర్దాంతమనోవిరోధమును దాలిచికాలము వేచియుండివ। న్యాంతరసీమ నాయనుజు

నార్చిమణిన్హరియించెగాయయో। యింతటిదుష్టుడున్ననిక నెట్లితరుల్ బ్రతు
కంగలారిలన్॥ క॥ మానకమణిగైకొనినన్। మానెన్ గరుణావిహీనమతియై
చుమదీ। య్యానుజునూరకదునిమెన్।వానకటాదీననేమిదనకులభించెన్.

ఉ॥ ఈతఁడుధర్మకర్తయట యెల్లవివాదలు దీర్చు పట్లనా। హాతనకిట్టి
దుర్నయము లర్హమెదుష్టతమామకానుసం। జాతునిజంపినట్టి కలుషంబదియె
ప్పటికైననిప్పయో। జాతదళాయతాక్షునకు సంఘటియింపకయూరకేగునే॥
తే॥గీ॥ మొదటవెన్నలుహరియించె బిదపగోప। కన్యకాంశుక హృతిసల్పెగడ
కునస్మ। దుపలనుగ్రహించె బాల్యంబునుండిచోర।వృత్తిచేగదబ్రతుకుటకృష్ణు
డహహ॥ వ॥ అనిగోవిందునిందింపుచుగ్రందుగావందురు సత్రాజిత్తునుసద్యస్స
ముచితాలాపంబుల నూరార్చి యటదరలి తమలోదారొండురుతో గృష్ణుం
డెంత జేసెనను వారునుమహాత్ముండగునతండిట్లేల జేయుననువారును దీనినిశ్చ
యింపనెవ్వరితరంబను వారునునగుచు నప్పౌరులు నిజనివాసంబులకుంజనిరం
తసత్రాజిత్తుండును యువీయవియోగాస్తోక శోకానల దందహ్యమానమాన
సుండగుచు నిద్రాహారంబులుజ్జగించి క్షణక్షణానుజాను జేత్యనులాపంబులగూ
యిడుచునాకేయి వేగుచున్నంత॥ మ॥ అనుమానంబున శౌరిదూరికలుషం
బార్జింపకేవంచుగ్ర। ద్దననాత్మప్రియశిష్యుడౌటనల సత్రాజిత్తుబోధింపనిం। పె
నయన్న్యాసర నాయకుండనుపగా నేతెంచుదద్దూతలా। గునబ్రాచిన్బొడిచెన్
మిణుకుఁరనివేగుంజుక్కఁస్వచ్ఛచ్ఛవిన్ ॥క॥సఖియోగకోకదృగ్జల। నివహమ్ముపా
వర్ష విరమ నిశ్శ్యత్యయకై। తవశారదవేళోద్భవ। నవధవళాభ్రమనదూర్చునం
డెలుపారెన్॥ తనకున్ శౌరికి హార్యభిఖ్య ధరసందర్భించుటంజేసిత। ద్ఘన
సౌజ్ఞాభ్యనుబంధ బంధురతిసత్రాజిత్తు దుర్నీతిన।ద్దనుజారాతికిదెల్ప వచ్చెనన
బ్రాతఃకాలవాతూలమొ। య్యనపీచెన్డరఫుల్లపంకజ కషాయామోదసంపా
దియై॥ చ॥ అవనినభోంతరాళగ హనాంతరసంచర దంధకారకై। తవమద
నాగమున్నమయదంభకిరాతుడు వేగుచుకఁకై।దువనరుకన్బొరిందొరగుతోర
ఫురక్తఝురంబనంగన। బ్జవనహితోదయ ప్రపథమపాటలదీధితి పొల్చెదూర్పు
నన్॥ శా॥ సత్రాజిత్తుసహోదరుంగురిచిత త్సద్మంబునన్ మ్రోయుని। ర్మా
తాత్రఽధ్వనియోయనన్గలకలారావంబుగావింపుచుం।బత్రిశ్రేణులుగూళ్ళవెల్వడె
దదాబాలప్రవృద్ధాత్రికిన్। ధాత్రీజంబులుజాలిబడ్డకరణిన్ జారెన్దుషారాంబు
వుల్॥ ఉ॥ పావనజాతశోభ బెనుపన్గుముదాళిశిరిన్హరింపగా। గేవలరక్తిమైనిను
ఢొగింజనుదేరగ దద్విజాతియా। గావునవొంటిమైనెదురుగాగనుపట్టగరాద

టంచునెంతేవడిజోడు గూడినగతిఁ గపగూడెరథాంగమయ్యెడఁ॥ శా॥ మా నానాండజ జ్ఞాతినేలుగరుడున్మన్నించువాడట్టిరా। ధానాథున్మదిగొంకకూరక యసత్రాజిత్తునిందించెగా। బోసికేతనిదుర్న్యయంబుహరికిఁ ముమ్మాటికిందెల్ప మా। కౌనంచుఁద్రివిధంబులన్మొరయుచాయన్గానేగో శ్యెల్లడఁ॥ ఉ॥ తేనియ నిగ్గుబొట్టునిడితేటులకాటుక దిద్దికర్నికల్। బూనిరజోహరిద్రమెయిబూసియు కంకణహంసకవ్రజస్వానమెసంగగొంధరగపయ్యెదజారగసన్ముఖాబ్జయై। భా నునికంటెనొల్లాలుతపద్మినిమేల్కనియుండెనింపునన్॥ మ॥ తనభక్తుండుప్రసేను నగ్రజుడుదుర్దాంతాత్తిచేనున్నవా। డనివానింగృపనాదరించుటకుడాయంవచ్చె నాప్రాచినె। ట్టనసూర్యుండుదయించెగల్యానృపచూడారత్నమైతోసమి। న్నైన కుఁబ్రాకెనవారుణాతపముతన్మాత్రాంగరాగంబునన్॥ వ॥ అయ్యవసరంబు ననాకేయుసత్రాజిత్తుండానచ్చుకృష్ణువిషయంబైననిందాప్రశంసకర్ణాకర్ణికగా బురంబునెల్లెడవిల్లి విరిసిపరస్పరపుగుసగుసలెసగమెసగు చుండెనటశౌరిహ జారంబున॥

సీ॥ తేజోపహృతవసుదేవుండు వసుదేవుడుచితక్రియోద్ధవుండుద్ధవుం డు। నానార్యపూజనానందుండునందుండు। వైరిభీకరణనా-సీరిసీరి-భూరిపు ణ్యోద్యమాక్రూరుడక్రూరుండుచకితలోకకృతవర్మవర్మ। సతతప్రతితశౌర్యసా త్యకిసాత్యకికల్యకుంఠితభుజాగదుడుగదుడు।నాదిగాగలబాంధవులర్హ పీఠి। కస్తు లైయుండకవినటగాయకముఖ నిఖిలజనములు తమతమనియమితస్థ। లులవసిం చియథావిధిబలసికొలువ॥ సీ॥ నికటస్థలినెసంగునిజసద్యశోవిక్రమములట్లశంఖ చక్రములువెలయ శ్యామలాభ్రోజ్వ లచ్చంచలాకృతిమేనహొంబట్టుజిలుగురెం టెంబువరల। బ్రధమాద్రిపైనొప్పుబాలార్కబింబంబు గతిగిరీటముమస్తకమున నమరc।నాత్మస్థభక్తాంచదను రక్తివెలిబర్వుపగిదిబేరెదకౌస్తుభంబునెలగ।హార కుండలకటకకేయూరముఖ్య। భూషణద్యుతులెల్లెడబొరయవంది। మాగధుల్ సంస్తుతులొనర్పమాధవుండు। నిండుకొలువుండెగన్నులపండువగుచు॥ వ॥ అ య్యవసరంబున నహారహంబుబురంబున గ్రుమ్మరునమ్మధుసూదనువార్తావ హులరుదెంచిసముచితభయభక్తిసంభ్రమంబులు మనంబునబెనంగొనవినయ వినమితశరీరులైకరకమలంబులుముకుళించియిట్లనిరి॥ క॥ దండంబుజగద్రక్షక। దండముజలజాతనయన దండముశౌరీ। దండంబుదేవకీసుత। దండముఖలహార ణనిపుణదండముకృష్ణా॥ అనినమస్కరించిమోలనిలుచున్నవార్తావహులలొగాం చికృష్ణుండునగరవార్తావిశేషంబులేమియనియడిగినవారలిట్లనిరి॥ శా॥ స్వామీ

దేవరవారికే యనుచువిజ్ఞాపింతుమీ రేయిను। ద్ధామప్రీతిబురింజరించు నెడస
త్రాజిత్తుగేహంబున। స్ఫీమార్తధ్వనిఘోరునక్ దివిభువుల్ నిండంగమ్రోసెంద
దీ। యామేయార్తరుతిన్వినఁబడెనవాచ్యాశ్రావ్యవృత్తాంతమున్॥ వ॥ అదియ
ద్దియనిన మున్నొక్కనాడుమీరుసత్రాజిత్తుగృహంబునకు విచ్చేసితదీయశమం
తకంబడిగిననతఁడిడకున్ననాటంగోలెమనంబునబగబూనియుండినిన్నతత్సహో
దరుండలప్రసేనుండమ్మణిధరియించియాఖేటక్రీడకడలికరిగిన నెరింగివానివనంబు
నజంపితద్రత్నంబుహరించితిరనినిజాదరణకరణనిమిత్తగృహాయాతపౌరజనంబు
తోఁజెప్పుకొని దుఃఖించెనవ్వార్తయేకర్ణాకర్ణివశంబున నెల్లవారితరేతరంబు
గుసగుసలంబోవుచుండిరని విన్నవించిననుల్లంబులుఝల్లుమన నెల్లసభాసదు
లును పరస్పరాలోకితముఖులయి యతివిస్మితచేతస్కులైరికృష్ణుండునునట్లన
య్యెనిజమనంబున॥ అక్కటనింతకంటెవిన నబ్బురమెయ్యదిపూర్వ మెన్నఁడో।
యెక్కడమానికంబడిగియుండితిగాకదియీకయున్నచో। నెక్కడవైరమూని
తిదియెక్కడిముచ్చటతద్వ్యలీయునే। నెక్కడప్రాణమారిచితి నెక్కడిమానిక
మున్హరించితిన్॥

ఉ॥ వానిసహోదరుండువనవాటికిఁబోవుటయే నెరుంగన। మ్మానికమే
డఁగొంటినణుమాత్రమునెమ్మదినెవ్వ రెట్టివా। రైనదెరుంగలేకజడుడైయతఁడేని
దిచేసితంచునా। పైననుమానమూనియపవాదము నూరకగూరిచెన్గదా॥ శా॥
న్యాయన్యాయములెన్నఁనెవ్వనితరంబాలించువారెల్లనా। హాయానానిదకాదు
కాదనెడువారల్గాకసారాంశమున్। దీయంజాలుదురే తలంపనకటానిందా
భరంబూరకన్।నాయందేర్పడెదీనినింకమరలన్మాయించుటేమాటకో॥ఉ॥నే
డిదినాకకారణపునిందఘటించుటకున్ నిదానము। న్జూడగనాత్తభాద్రపదశుద్ధ
చతుర్థిపయోఘటోడుస। మ్మాడనుబింబదర్శనసమగ్రతనూశశిగూర్చి విఘ్నగా
జాడినశాపవాక్యముయథార్థముగాకదియేలవేరగున్॥ వ॥ అనిమనంబునసూహిం
పుచునానిఖిలగుణగణాలంకరిష్టుండగుకృష్ణుండెల్లవారలువిననిట్లనియె॥ సీ॥ విను
డేనుమున్నొక్కదినమునబంధుభావమునసత్రాజిత్తుభవనమునకు। సరవినేతెం
చిప్రస్తావవశమ్మున నతనిభావమెరుంగనాశమంత। మిడమంచుగోరితినింతయ
గాకింకనేకల్మషక్రియనెఱుఁగనిట్లు। నూరకనిందసేకూరెనాయడదీనినె భ్ఛంగి
నైసమాయింతుగాని। పూర్వమందుజతుర్థినంభోజవైరి। గాంచువారికినపనిం
దకలుగుగాక। యనుచుజంద్రుగురించిగజాస్యుడాడు। మాటనేడిట్లునాపట్ల
సూటిపడియె॥ చ॥ అనవినిసభ్యులెల్లవిననాహరితోహలియిట్లనుక్సుధాం।

శునిమహీనెవ్వ రేనియును శుద్ధచతుర్థిని గాంచిరేని సడెం। గనిమెదరంచు నేలను
డుకాంతు శపించె గజాస్యుడద్దినం। బున నెశశాంకుదర్శనము బొందగ నేటికినీకు జే
కురెన్॥చ॥ అనిబలదేవుడాడ్లనలినాయతనేత్రుడు తత్కథాక్రమం। బునిఖిలమ
గ్రజాతునకు బోధమొనర్పగ నుత్సహించియి। ట్లనుకుసుమాయుధాహితశిరోం
తనితాంతసరిన్ముహుర్ముహు। ర్జనితతరంగరంగదతిసాంద్రఘుమంఘుమనాద
మాధురిన్॥

శా॥ దిక్కాంతాభిముఖస్థదర్పణమనన్ దీపించు రౌప్యాద్రిస। వ్యక్కా
తూహలవృత్తిసర్వసురసమాౕటకోటికోల్వన్మణీ। భాకూటంబున భద్రపీఠి
నుమయున్ భర్గుండుగూర్చుండి మే। ల్పెక్కాప్పన్ భువనావనంబరయుచుం బే
రోలగంబున్నచోన్॥ క॥ జననీజనకులకింపుగ। గణనాథుడుబాల్యకేళికాపరు
డై పె। ల్చనకుజ్జాకృతినచ్చట। ఘనముగ గ్రీడింపుచుండగని చంద్రుడెదన్॥ఉ॥ యా
తనికన్నులెంత మొగమెంతయుదోజ ఘనంబులెంతకా। ల్సేతులవెంతయీగిట
కసీదిలకింపగరోతయంచురూ। పాతిశయస్మయంబునగిలార్చుచుబక్కనన వ్వె
నవ్వినన్। శీతమయూఖునుద్ధవిడసింధురవక్త్రుడు గాంచిచెచ్చెరన్॥ చ॥ కినిసిమ
హాగ్రుడౌచుబలికెన్నిరతంబున శేషలోకపీ। త్యనిబిడచారుమూర్తినసిగర్వము
చేనవమానదృష్టినై। కనినను నవ్వెదత్ఫలము గాంచెదు గాక చతుర్థి చంద్రునిం। గ
నినజగజ్జనంబునకకారణనిందనమానవహిల్లెడున్॥ మ॥ అనిశాపంబిడినంత నేవెర
చియోయయ్యాజడాత్ముండనై। యనఘున్ నిన్నుహసించినాడమదినాయజ్ఞాన
మున్ సైచవే। జనముల్ నన్ గననట్టిమొచ్చెమెనయన్ జాలంగృపావీక్షణం। బున
నన్నున్ దిలకింపుమంచుశితధాముండార్తిబ్రార్థించినన్॥ శా॥ కారుణ్యాత్ముడై గ
ణాధిపతివక్కాణించెమచ్ఛాపదు। ర్వారాలాపమమోఘమెందునదితప్పన్ జాల
చేతత్ప్రతీకారోపాయమొకండొనర్చెదనువేడ్కన్ నన్నుకల్పోక్తినా- ప్పారం
బూజమొనర్చువారలకువేయానిందబాయున్ శశీ॥ఆ॥ నావ్రతంబుసలుపునరులకు
నపవాద।మడగుటేమివింతయట్టివారి।కీప్సితంబులెల్లనేపారుననియుమా।సూను
డబ్జవైరికానతిచ్చె॥ ఉ॥ అప్పటినుండియున్ మనుజులబ్జవిరోధిచతుర్థిజూడగా।
నొప్పరుదప్పిదారిమెపుడొక్కెడదైవకృతిన్ హఠాద్గతిన్।దప్పకగాంచనైననని
దానపునిందఘటిల్లుదానికై। యప్పురభిత్సుతవ్రతమునాచరియింతురనారతం
బుగన్॥ చ॥ చనినచతుర్థినాడెచటచంద్రుడుగన్పడునోయటంచునే। ననయము
నప్రమాదమతినారయుచుండెతినున్న నేమిడా। సినవిధిదప్పనేరుచునె క్షీరఘ
టాంతరమందునాకుదో। చెనమృతధాముడక్కట మచేనిటులూరకదూరుచేకు

రెన్॥ మ॥ అపనిందాహరణార్థమిప్సితసమస్తైశ్వర్య సంసిద్ధికై। విపుల శ్రద్ధ
నేక దేవతలునుం బెక్కండ్రు రాజర్షులున్। ద్విపవక్త్రవ్రతమాచరించిరనుచున్
విన్నారమంచున్ రమా। ధిపుడేవంవిధి జెల్పసీరివిని దైతేయారితోనిట్లనున్॥

క॥ పరువాని దాననిందా। హరమఖిలేప్సితశుభావహంబగు నేత। త్కరివద
నార్చావ్రతమున్ రువడి జేయుదనుమనము బరమప్రీతిన్॥ అనదోడ్తోపురిజాట
బంచిశుభవాద్యవాద్రితముల్ మ్రోయతా। రనుమోదంబున రామకృష్ణులుకృతై
కాభ్యంగనస్నానులై ఘనభూషాంబరగంధమాల్యమహితాకల్పాఢ్యులై బాం
ధవా। ప్తనికాయంబుపురోహితాది బహువిప్రశ్రేణివేష్టించిరాన్॥ గీ॥ ఆత్మదై
వతగృహమున- కరుగుదెంచి- కనకపీఠస్థులవుచు గాంచనవితర్ది। విమలమణిపీఠి
సౌవర్ణ విఘ్నరాజ। విగ్రహంబుప్రతిష్ఠగావించిభక్తి॥ క॥ కల్పోక్తపూర్వకము
గన। నల్పపురోహితముఖయిక నానార్యసభా। జల్పితవాగనుగతిసం। కల్పము
గావించిసాంద్రకౌతూహలులై॥

సీ॥ ధ్యానంబు శైలకన్యాతనూభవునకు నావాహనమ్ము గణాధిపతికి।
నర్ఘ్యపాద్యంబులు హరుకూర్మిపట్టికి నభిషేకముమతంగజాననకును। లలితపు
ష్పాంజలుల్ లంబోదరునకు నిర్మలపుగంధంబు ద్వైమాతురునకు । ధూపంబు
మూషకతుఖ్కరునకు దీపమురగభుగ్వాహపూర్వోద్భవునకు । మోదకో
దనముఖ్యనివేదనంబు । విఘ్ననాయకునకు నంచువేడ్కనొసగి । భక్తరక్షార
తాయకృపాయుతాయ। యఖిలదాయ నమోనమోయనియొరిగిరి॥ శా॥ ఈరీ
తిన్ వివిధోపచారములచే హేరంబుబూజించి దీక్షారాజచ్ఛుభకంకణాత్తక
రులైసంతుష్టి బొందించిరి। పారన్ భూసుర కోటినిష్టతరమృష్టాన్న ప్రదా
నాప్తిప్రేమారూఢోక్తుల భూరిదక్షిణలచే నానీలపీతాంబరుల్॥ క॥ అనుమదితు
లగుచుబ్రాహ్మణులనిశా భీష్టార్థసిద్ధిర స్తని నెయ్యం। బునబల దేవాంబుజలో। చ
నులనునాశీర్వదించి జనిరిరువులకున్ ॥ శోషితవైరిసిరియను । బుంజలజాతుని
జూచిభోగిరాడ్భూషసుతవ్రతంబుపరిపూర్ణముగా నెర। వేరెదత్కృపాశ్లేషతనీ
ప్రయత్నము ఫలించునుగావున నాశమంతకాన్వేషణ మాచరింపుమికనీ।
వపనిందదలంగనావుడున్॥ క॥ తనచేతస్సంకల్పం। బునకునిజాగ్రజునివాక్యము
లుసూటిపడన్। మనమునహర్షించిరహీన్। వనజాక్షుండనియె నెల్లవారలువిన
గన్॥ శా॥ మాత్రాతీతశుభంబెసంగగణ సమ్రాట్పూజగావించితిన్। ధాత్రిం
ధన్యుడనైతి నెయ్యడశమంతంబున్న శీఘ్రుంబునన్। సత్రారాతిసుతప్రసాదము

నవేసాధించివోడ్తెచ్చియా సత్రాజిత్తునకిచ్చెదం తదుదితాక్రోశవ్యోక్తిమా
యించెదన్॥ వ॥ అనిమహోత్సాహంబున బలికిశార్ఙ్గగదా ప్రధానదివ్యసా
ధనసహితంబుగా రథంబ్బాయితంబొనరించితెమ్మని దారకునియోగించినతివే
లశౌర్యరసలీలా హాళహాళికదనుత్రాణశిరస్త్రాణంబులు ధరియించిసుదర్శనపా
ణియైశమంతకాన్వేషణప్రయాణోన్ముఖుండగుటయు॥

సీ॥భీషణాభ్రంకష హేషాపరాభూతశాత్రవసైన్యమౌ సైన్యమూన్చి
ఖురవిఘట్టితధరాభరనతాశేభ సుగ్రీవమైతనరుసుగ్రీవమూన్చి। ధారాజితాం
భోనిధానోన్నికా మేఘపుష్పమైదగు మేఘపుష్పమూన్చి। వాలవిక్షేపనోద్భట
వాతధుతబలాహకమై వెలయుబలాహకమునూన్చి। యరదమాయితమొనరిం
చియందుగరుడ। కేతనంబెత్తిముంగలగేలుమొగిచి। దారకుండున్నభక్తమందా
రకుండు। నరసఖుదుద్ర ధారోహణంబుజేసె॥మ॥ ఖగరాట్కేతు విఘాంతు
దాక్రమిత చక్రస్వామినేమ్యుగ్రనా।దగణక్షోభితదిక్కరిశ్రవణబృందంబౌశ
తాంగంబుపైనాగలంగిల్లోకానిదారకుండు గవికెల్నోళ్ళందు సళ్ళించిపెల్లుగ
దోలెన్ హయులంగరాగ్రవిలసల్లోలత్కుశావల్లినై॥ ఉ॥ అంధకభోజవృష్ణికు
కురాంధకవీరచమూపరంపరల్।సింధుతరంగబృందముల చెల్వునపైపయిరా
గభేరికా।దంధణదంధణంధణనదధ్వనిసంచయముల్ దిగంతపుం।సంధులుప్రీలజే
యనరుసంబలరారగ బోయిచెగటన్॥ స్రగ్ధర॥ కనియెన్ కృష్ణుండుసైన్యోత్తరా
రములియుగడన్ గ్రందుగారాగభల్లూ।కనికాయఘ్రాణరంధ్రోద్గతపవనచయా
కర్షితాభీలవల్మీ। కనితాంతోత్క్రాంత దర్వీకరనికరశిరః కంజరాగోట్మకా
లో। కనజాతతాత్సదా వద్గహానమదగజగ్రామకాంతారసీమన్॥ మ॥ కనిప
ద్మాకరముల్ దరుల్సొరెలు వాకల్గుంజముల్ శైలపా। దనికాయంబులుగండ
షాళికటకస్థానంబులున్మత్తవా।రణపాదాంచల ముద్రితస్థలులు వ్యాఘ్రక్రో
డముఖోగ్రజీ। వినిశాంతంబులు శౌరియయ్యెడ వినన్వేషించుచుం బోవగన్॥
శా॥ తత్రత్యస్థలులం బ్రసేనకరకోదండచ్యుతాస్త్రచ్ఛటల్। గాత్రంబుల్ దెగిప
డ్డశల్యాచమరీ గంధర్వవాహాసుహృ। త్పోత్రివ్యాఘ్రతరక్షుగండకమృగేట్తుండి
ద్వీశీర్షైనముల్।చిత్రంబైకననయ్యెశౌరికినతక్షేమక్రియాకారికిన్॥ మరియును॥

క॥ ప్రేంఖత్కంఖాణోత్తమ। రింఖాటంకాంచల త్వరితధాత్రీరధ। ప్రేంఖోళ
నమాపిచమూ। శంఖింబులతోడశార్ఙ్గ చాపుడుకనియెన్॥ మ॥ అలధారాట
ఖురాగ్రకర్షితవన జ్యామార్గముల్ దోట్టియు। వ్యాలబోగన్నడె సింహశాతనఖ

రప్రతప్తుణ్ణదంతావళో। జ్వలకుంభచ్యుత మౌక్తికోత్కరములుల్ వాహిద్ధని
ర్యాణదం। తలత్రాంతామిషముఖ్యముల్ దనరుగా త్రిభ్యద్ధుహాదేశముల్॥
శా॥ దాసిన్ జూచుచురాగ నయ్యమణిమీదన్ మ్రొగుచున్ పక్షికా। శ్రేణుల్
పెన్రొదలాచరింప విలసజ్జింహాంజిరంజీపిసం। తానంబుల్ వెకేద్వమాగ్మడ
నుగోత్రంగూలియున్నట్టియా। జానేయంబుయా దూద్వహుండుకనియెన్ సై
న్యాళితో జెంగటన్॥ క॥ కనియిదిప్రసేనుతురగం। బనితనవారలకు జెప్ప చరి
గెడుయాదునం। దనునకు ప్రసేనుపీనుగ। గనుంబోడగానవయ్యె నంతార
మునన్॥ మ॥ నరశింహోజ్జ్వల శాతదీర్ఘన్ నఖదంతక్షుణ్ణ దైత్యేంద్రమాదిరి
గా సింహపునర్ఛ వాంచలపిశ్ఛదీభూత సర్వాంగుడున్। ఖరవజ్రోపమ దంష్ట్రికా
గ్రవిదళత్కంఠుండుదంశీపరు। పరితుండును బలిప్రష్టపీడితతనూ మాంసుండునై
యున్నెడన్॥

మ॥ కదియంబోయిమహోగ్ర కేసరినఖాగ్రచ్ఛిన్న సర్వాంగుడై।
చదిసెన్వీడె ప్రసేనుడంచు స్వసుహృత్సంఘంబుతో జెప్పితా। చ్ఛదముల్ శోధన
జేసిదివ్యతరరత్నం బందు లేకుంపుటన్। గదలెన్ సింహము చన్నమార్గమునసా
కంసారిసానీకుడై॥ ఉ॥ గబ్బు వెడంద నోటశకవ్రజమీగలు మోయగా
ట్పుపై। ప్రబ్బి సటల్ జలింపబెను బాతులుగ్రద్దలుకాకులుంగరం। బుబ్బుచుము
కుంలందరసమూడిచిమెకర్ణ జచ్చి పడ్డబల్। బొబ్బ మెకంబుగాంచె యదు
పుంగవుడేగుచు గొంతదవ్వునన్॥ వ॥ కాంచిపంచత్వంబునొందిన పంచాస్యం
బు చెంగటికరుగుదెంచి యకార్యాంచనాంబరుండనుచరసంచయంబులన్ గనియిట్ల
నియె॥ క॥ సత్రాజిత్సోదరునల। గోత్రగృహానికటసీమ గూలిచియెచటన్। గా
త్రంబువాయుసామజ। శత్రువడుగుజాడమనకు సర్వముదెలసెన్॥

చ॥ ఇదివాకయచ్ఛభల్లనఖహేతిహతిందెగటారినట్లునాహృదయములో
నదోచెగనుడిచ్చటదచ్చరణాంకముల్ లభిం। చదుమణి ఈడభల్లుకముజాడనబోయి
తిమేనిజేతిక। బ్బదెయదిరండటంచుయదువల్లభుడేగుచునుండెనయ్యెడన్॥ సీ॥ ధ
కార్కమహోగ్రఘాంఘాన్నినాదార్భటల్। భటులసందడిమోతబలసిపెరుగ।
బహుపదాతిచ్ఛటాపదపరాగములు పరాగముల్ ముసుగొందబ్రాకేదివికి। ధీర
సైన్యేశకోటీరంపువెలుగులు వెలుగులరాజిగుల్వియ్యమంద। నిశితవాలప్రభాసీల
వితానంబుసీలవితానమైనింగిబర్వ। నడచెవృష్ణి కేకయాంధకముఖోరు। సై
న్యకలితఖాణశఫపుటక్షతధరాధురా ప్రభుగ్న స్ఫుటస్ఫటిప్రభువతంసు। డగుచుహరి
భల్లుకేశ్వరునడుగుజాడ॥

శా॥ కాంచెన్ పంకజపత్త్రనేత్రుడలఋక్షస్వామిగుప్తాత్మమా। ధ్యాంచద్దివ్య
మణీపరిగ్రహణకార్యాయాతనై జాగమో। దంచల్లాభకృతార్థభూధరనుతిధ్యా
నౌషధీకృన్మురు। త్సంచారోగ్రనదద్గుహన్ గురుతరధ్వాంతచ్ఛటాధూర్వహన్॥
క॥ అలగహ్వారీధరమహా। బిలపర్యంతంబుఋక్షవీరుపదాంకం। బులుగలుగుట
దన్నికట। స్థలిదాశార్హుండుసానుచరుడై చేరెన్॥ ఉ॥ ఈగతి జేరికృష్ణుడుని జేష్ట
లనందరగాంచినేడునే। నీగుహజొచ్చిరత్నముగ్రహించివడిన్ జనుదెంతునిచ్చ
టన్। బాగుగనిల్వుడీయనియపారతమః పటలీప్రవేల్లితో। గ్రాగబిలాంతరాళ
పథమందరిగన్ పృథుధైర్యశాలియై॥

క॥ భువనములుజడిననాడ। ర్ణవముననొకమంత్రియాకు నంబడియురుతె
క్కు-వయగుతరిభాసిలుమా। ధవుడలుకునెకొండ గవిబాదలుచీకటికిన్॥ ఉ॥ గ
హ్వరమందుగారొనిన గాఢతమచ్ఛటయోజనార్థమా- బాహ్వాభిభూతశేషు
డగుపద్మదళాక్షుడు బోయిగన్గొనెన్। బహ్వరవిందముల్ మధుపపంక్తులురా
జమరాళముల్ రథాం। గాహ్వవిహంగముల్ గల మహాకమలాకరమింపుమీర
గన్॥ వ॥ వెండియు జెండమయూఖుండు దర్యఖండధ్వాంతే మండలంబులంబు
రుడింపబహురూపమండితుండై జ్యోత్స్నోయనసముత్తాల ప్రభాపాళికాతి
వేలమణీజాలాలవాలంబులగు కూలంబులును। రంగదుత్తుంగతరంగాభంగడో
లాసమాలోలమరాళబాలికా వళక్షపక్షాక్షీణ వాతోత్క్షేపితజలబిందుపరంప
రాసంభరితమరుత్కిశోరవారంబులును। వదాన్యపుసుపావచాతకీర్తిచ్ఛటా
ధాళధళ్యకాంతులందెగడుపాండురసితాభ్రఖండంబులు కాండాధిపతికనిరా
జనంబులీసమకట్టికమలావధూటిస్ఫాటికపాత్రలందు నాటించెనోయనదరీభా
గభాగమలినాబ్జకాంతోపలఫలకోపాంతకాంతంబులగు ఫేనోత్కరంబులును।
సత్య లోకంబుపోలికకు శేశయజాతోద్యోతితంబై। వైకుంఠంబువడువునచక్రవి
క్రమప్రకాశంబై కైలాసంబుచందంబునభృంగ్యనిశాశ్రయంబై। సుగ్రీవసైన్యంబు
భంగి।కముదసంయుతంబై। సరస్వతీబాహుదండంబుగతికచ్ఛపీశోభితంబై। య
భంగామృత పూరంబయ్యునభంగామృతపూరంబై। యవిసారాభిరామంబ
య్యునువిసారాభిరామంబై నారాయణతుందంబుగతి భువనపూర్ణంబైవెల
యు నజ్జలజాకరంబు గడచిముందర॥

సీ॥ పోవపోవగదోచె పుష్పితఫలితరుక్ష్మమయరంభాదికక్ష్మారుహములు
జనజనబాడగట్టైమణిసాల సౌధగోపురసురాలయధనాకరగృహములు। న
డువనడువజూడ బడెరత్నపట్టభంగిస్ఫురత వతదీర్ఘికాచయములు। సాగసా

గంగగాంచగనయ్యె బహుచిత్రవర్ణముల్ గలిగినపక్షితతులు । నరుగనరుగం గ
జూపట్టైననిశముఖిల। శాస్త్రచర్చాప్రథితకీరశారికాళు। లేగనేగగనంబడిరిందు
ముఖులు। హర్మ్యభాగంబులందునారాయణునకు॥లయగ్రాహి॥ సారఘనసా
రసుపటీరముఖసౌరభవిహారపృథుఘూర్ణగృహవారములనెల్లన్ । మీరియుమ
సారమణిహారపుహజారములజేరజనపంజరపుకీరనికరంబుల్। బేరెలుగుతోనిత
రహూరుడిటుజొచ్చెనిపుడారసిగనుండనుచుసారెకువచింపన్। నేరుపునమించుస
దగారములగొన్నిటినిధీరుడటుగాంచియదువీరవరుడంతన్॥ శా॥ కైలాసాచల
శృంగమట్లలరురంగజ్జాంబవత్యంగనా। కేళీసౌధముపట్టభంగసరణింగృష్ణుండు
బైకెక్కిద।ల్లీలన్మెచ్చుచులోనికేగికనియెన్ దివ్యప్రభాకాంతమున్ । త్రైలోక్య
స్తుతిమంతమున్ వరశమంతంబున్ శుభాకాంతమున్॥చ॥ ప్రకటముగాకయుం
డపదపద్మములల్లనమోపుకొంచునం। దకధరుడేగిపైముడినిదావదలించగమూ
పుపైశమం।తకమణివ్రేలెబుచ్చుపసుతామహితాధరపద్మరాగమి। ట్లకుటిలవృ
త్తిభావిసమయంబునజేకురునన్నకైవడిన్॥ గీ॥ జాంబవత్పుత్రికాధాత్రిశౌరి
గాంచి। బెగ్గడిలిబుచ్చునాధునిబిలచినీదు । నందనీకేళికాకుర్దనమణిగొనగ। వచ్చి
నాడిటుదొంగజవమునరమ్మి॥క॥ అనియాక్రోశధ్వనిజే।సినవినియయ్యచ్ఛభల్లశే
ఖరుడురయం।బునసంవర్తాంతకుచా।ట్పునదస్థలికరుగుదెంచె।భూమిచలింపన్॥
చ॥ ఉరువడిజేరికృష్ణగనియోరిగజారివసించియున్నకం। దరమునకున్ శశంబుగ
తిదల్పకమద్గృహమైనయీబిలాం। తరమునకేగుదెంచితిగదామరియంతటబోక
రత్నత।స్కరతయొనర్పబూచితిరసన్ బ్రతుకంగగలావెదుర్మతీ॥ చ॥ తిరిపెము
గాగనేనడిగిదెచ్చినరత్నముగాదులోకభీ । కరమృగరాజునొక్కడనఖప్రహ
తింబెకలించికొన్నభా।సురమణిదీనినైకొనగజొప్పడదెంతటివారికైననీ।వరయ
కవచ్చితొల్లుగుమా బ్రతుకంగదలంపుగల్గినన్॥మ॥ అరవిందాసనసూనుడన్
బటుజవోద్యద్బాహుయుగ్మండదా।శరధిన్గారిచిత్రేతనాడసురులన్ జక్కాడి
ద్యావాధరాం।తరమందచ్చపుకీర్తినించినమహాధన్యుండనేనేడహా।నిరుపాయుల్
నరులేడపోమ్ము దయనెంతేనిన్నుమన్నించితిన్॥మ॥ అనిపల్కన్గనులెత్తినందతన
యుండాభల్లుకస్వామితో।ననియెన్ స్వస్తుతిసల్పుకొంటివిఘనంబానేహరింజంపి
యీ।మణిజేకొంటయెఱింగినిన్నుబలిమిన్ మర్దించినైకోదలం।పుననేతెంచినబల్లి
దుండనెటకున్ బోనీనురమ్మాజికిన్॥అనిపలుకుచు॥ శా॥ గానందుక్కునపైడికా
శబగ్గయంగాజేసిసద్భూషణ । శ్రేణుల్జక్కగదిద్దిముంగురులనర్థింబైకిగీలించిక।
ల్పానూనోగ్రఘనాఘనచ్యుతనినాదాభీలదోఃస్ఫాలన। ధ్వానుండైయదుభర్తని

త్త్వవిలసద్దర్పాతిరేకంబునన్॥ చ॥ అతఁడనుమాటలన్ నిలచినట్టి తెఱంగును జూచి
లోహితద్యుతులుగనుంగవం జెదరదోర్బలధుర్యుఁడు జాంబవంతుఁడు। ప్రతిమమృ
గేంద్రనాదవిసరత్రుటితాష్టదిశావశాధిప। శ్రుతిబిలుఁడై వడిన్నడచె శూరతగంస
విరోధిమీఁదికిన్॥ క॥ పరిఘముగొని జాంబవంతుఁడు। వరకౌమోదకిని దాల్చి వార్ష్ణేయు
డుని। స్ఫురతరకోపంబులఁదా। కిరిలోకత్రాసనసమరకేళీరతులై॥ వ॥ యిట్లు నజ్జాం
బవజ్జాంబూనదాంబరులుద్దండసంవర్తకాండమార్తాండ మండలద్వయంబు
మెండుననభంగోత్తుంగభంగప్రతాడితవిహంగరంగంబగుతరంగమాలియుగం
బుభంగిప్రళయసమయకుపితయమయమళంబుకొమరునవిలయవేళాభయంకర
శశాంకమౌళిఫాలస్థలనిర్యత్తీవ్రలావద్వ్యగ్నంబుపోలికనక్షీణపక్షంబులై సర్వత్ర
మావలయంబునందారుకులక్షోణీధరద్వంద్వంబుచందంబునకల్పాంతానల్పసాగ
రోదరవిముక్తౌర్వయుగళంబుపగిదిదగిలిచుట్టు పేరెంబుగాబరచి చదలద్రువగద
లుద్రిప్పుచుపరిఘాఘట్టనంబుల వ్రాలుకీలాఘట్టంబులనంతరంగంబునబొంగారస
ముద్భటపద్ఘాతంబులగోత్రాతలంబుగంపింపవిశేషరోషోద్రిక్త దృక్త్రోయజవి
ముక్తరక్తప్రభాజాతంబులుప్రద్యోతనాతపంబులరీతివ్యాపింపప్రళయవేళోగ్ర
నిర్యద్గర్జాభీషణాన్యోన్యతర్జననిర్ఘోషణంబులశేషగుహాస్థలంబులమాఱ్మ్రోతలుపు
ట్టింపనాలీఘాదిపాదహతుల నురగపతిగుదులుకొనకూర్మంబుగ్రుంగగ గిరిరా
జోరుగగకుభిభంబులుదిటతప్పిచతిలబడదరిమిచిత్రగదాసారణవిధంబులనుడుప
ధంబునకువినూతనఖ్యాతియుదయింపస్వస్వాభీలబలరయ విక్రాంతులుసమా
లోకిలోకంబునకద్భుతంబాపాదింపనంతంతకధికంబగుమదంబునన్ బాదలె
డుభుజాయష్టులనిష్ఠురద్రవిణనైపుణిబాగడచండాట్టహాసంబుల నొండొరులనా
దరింపకనొండు దెసంబూన్చియొండు వైపునన్ జబురుచు గాయంబువంచించివ్రే
టుదప్పించుకొనచువీలయినతరిమహోత్తాలతాలప్రమాణంబులగునిజసాధనం
బులచేజెండుచు సానుమద్బిలంబునగరిల్లుపెరిల్లుమని ప్రతిస్వానంబులీనమిథఃపరి
ఘాప్రహారంబులనాగుచు నప్పుడప్పుడుప్పరంబెగసిపయింబడగుప్పించుచువ్రేటు
మేనుమీదనాటనీక దాటిమగుడ। డాసిరోసంబూరవ్రేసిమీసంబులుదువ్వుచుగట్టి
బోరియపైతట్టుతలలుముట్టఘట్టించిదుముకుచుగట్టులుకనట్టహాసంబుజేసి యిదు
గోబెట్టుబెట్టైదనెట్టుదప్పించుకుందువోయనిమందలింపుచు నమందదర్పంబునగా
లసర్పంబులగతిరోజియితరేతరాయుధాహతుల గిర్యంతరకర్పంబుబగుల్చుచు
నిరుపురియమగులభారమ్మునబడిగెదాల్పుటొడయనికిగడుమోపడరవృత్త భ్రి
మణాయత్తులైనడుచుచుదమతమనొప్పిదప్పులకులుకకబెద్దదడవుగ్రద్దరితనంబున

య్యెద్దరుఁబోరు నెడ॥ మ॥ పరుషక్రోధముతోడ ఋక్షపతిగోపాలప్రభుంజూచి యీ త్తరినీజీవముఁగొందునంచు బరిఘాదండంబు వ్రేయంగమిణుం। గురులీలం బరతెంచు దానివిలసత్త్రూత్కారోగ్రగామోదకిం। జిదునుగ్గై పడఁజేసియాత్రైభువనశ్రేణుల్ క డుంబెగ్గిలన్. క॥ తన పరిఘువ్యర్థమైనన్। గని భల్లుకరాజు వహ్నికణసంచయము ల్। గనులన్ దొరుగఁగ సాలా। వనిజము బెగలించి వయిచె వనరుహనాభున్॥

గీ॥ దానిపొడిపొడి సల్పనాతండు రోష। వివశుఁడై చేరువనె సంగువృక్షత తులు। లాగికొని వృష్టి సేయ శైలధరుఁడాత్మ। గదవడిఁగఁ ద్రిప్పి చూర్ణంబుగా నొన ర్చె॥ ఉ॥ చేరువవృక్షపాళులు నశించినగండశిలాపరంపరల్। గ్రూరతవైవ దా ఋక్షాతురగుండు గదోగ్రవిఘట్టనంబులన్। బారఁగ దట్టిభయిరవరవంబున నార్చె ఖగప్రతానముల్। జ్యారుహపాళి జచ్చి ముదరాకుల ఛాపునబిట్టుగూలఁగన్॥ మ॥ శిలలుం జెట్టులుశూన్యమైన పటుముష్టిం గ్రుమ్మరాగాఁగరో। జ్వలకౌమోదకి దవ్వు గానిలిపి సాళ్వద్వేషి రోషించిబుు। ఋక్షలలామున్ వడిఁడాసె మల్లరణకాంక్షన్ సా యుధాటోపులయి। కలహాన్యాయవిదుల్ నిరాయుధుల దాకంబోరుజన్యస్థలిన్॥

క॥ స్రష్టకొడుకుబూనినబలు। ముష్టినిదప్పించుకొని విపులసత్త్వమునన్। ముష్టికవిరోధ్యనుజుఁడు। తత్పృష్టంబుగ నెట్టె భువిజతికిలబడంగన్॥ క ॥ బడి లేచి వి లయకాలుని। వడువునగను లెత్తి వృష్టివల్లభుగనిక। న్గడలక వెడలెడు నిప్పులు। జ డి మైగుహానిండఁడాసె। సాహసవృత్తిన్॥ శా ॥ దీనన్ నీయసురార్తునంచశనితో దీటౌమహాముష్టికీలానైకంబులువారనెత్తి శిశుపాలద్వేషి నేయన్ గడుం-దానింద ప్పగ ద్రుంకితోనవిలసద్దర్పంబుతో విశ్వస్పృ। ట్ప్రాణున్ మల్లునదన్నె శౌరిగవినస్తో కస్వనంబీనఁగన్॥

వ॥ తాకినసోలి తెలిసి వెండియు॥ సీ॥ బడలాగిననుగిరిప్రతిముఁడై యదుభ ర్తమించియవ్వాలికిలంఘించినిలచి। కేలెత్తి వ్రేయుచోఁగికురించి వీపువైపున కేగి యట సేయబుద్ధినిలిపి। మెరసి పైరాఁబొమ్ము మీఁది కొడ్డుకయుండు ఘనముష్టితతు లలోఁగాకనాఁగి। జొచ్చి రావంగియీఁసునపిడికిలికోటచాట నీకెట్టులాతట్టుబారి। వడిసిసిగబట్టుకొన రాగబాడవుగాఁగ। నెగరిముకురుఁ చెదర దన్ని దెగువనురికె। జాంబవంతుండు కృష్ణుఁడీసరణి రణము। జేసిరిరువదియేనిమిది వాసరములు॥

క॥ నగధరుఁడష్టావింశతి। యగువాసరమందు భల్లుకాధిపు మేనం। పగిలించె బిడు గుతునకల। దెగడు చెటులముష్టితతులధికరౌద్రముగన్॥ శా॥ ఆవ్రేటుల్ మెయి నాటి బెగ్గడిలి ఋక్షాధీశ్వరుండీఘనుం। డావిశ్వంభరుఁడౌటనిక్కమఖిలప్రాణం బులార్పన్ మహిన్। దేవప్రార్థితుఁడై జనించెననియంతే బుద్ధియోచించిగ। గ్రావి

ర్భావముడించిమ్రొక్కి-విజయవ్యాపారికిఁ శౌరికిఁ॥ మ్రొక్కి-యిట్లనియె॥చ॥
జయమధుమారణావినుతచారణసృష్ట్యవనాంతకారణా।జయగుణరంజనాదు
రితజాలవిభంజనసన్నిరంజనా। జయనతలోకరక్షకనిశాచరశిక్షకసర్వదక్షకా।
జయశుభదాయకాగిరిశసాయక భవ్యవికుంఠనాయకా॥

సీ॥ నినుబ్రాతమగవానిననఘువిష్ణునిప్రభవిష్ణుగాదెలిసితివిశ్వరూప।ప్రా
ణప్రతాపధైర్యబలంబులఖిలభూతంబులకీవమార్తాండనిలయ। సర్వంబునకు
సదాస్వర్గస్తితిలయంబులెవ్వరుగల్పింతురీవగాక। యంతటికిఁబోఁడయుండవాత్మ
కుబరమాత్మ నీశనీమహిమనేనెరుగగలనె। మనువులుప్రజాపతులును దామర
సభవుడు। భవుడుదిక్పాలకులు శేషఫణిసమస్త। సురలుగ్రహాళికపిలాదిసూ
రివరులు। తావకాంశజులగుటసత్యముముకుంద॥

హరిపరమేశసూరినిచయాచరితైకసమాధిభేదవి। స్ఫురితమహాంసధర్మ
పరిబోధ్యముభవ్యకపాలమార్గమం। దరయగలబ్ధమాత్రుడవునై సుఖివై దగుని
విలక్కళేబరములకుద్భవస్తితివివర్ధనహేతువుగానొసంగితో॥ గీ॥ క్షితివిను
తషడ్గుణైశ్వర్యయుతుడవైన। నీవువెలుగుదాత్మారామభావమెనసి।యమితమా
యామయుండవై। యఖిలసాక్షి। వైబ్రకాశింతువయ్యాచరాచరముల॥ సీ॥ తత
గుణసర్గభావితుడవైనైకవిచారప్రమాణవిస్తారములగు। తర్కశాస్త్రంబులక
ర్కశులగుచుదురాగ్రహవాదులయినట్టివిబుధ। సంతానవాదానుసరణపర్యంత
ములైనస్తినాస్తీతిముఖ్యానులాపములసర్వమాయాప్రపూర్ణుండవై స్వకప్రకృ
తిచేగానంగబడకయుక్తిగోచరుడవై విషయరూపకోటినలరు। దనిలభుగ్భ్రాం
తిరజ్జువునందదోచు। పగిదిద్రవ్యాంతరములప్రపంచభావ। మగుపడియెబ్రహ్మ
మైననీయందశౌరి॥అవతారదశకము॥ మ॥శ్రుతిచోరాసురహృత్స్థలాసితపలస్యూ
తాంత్రబోనాగనం।చితవైవస్వతరాజవాసతరణిక్షిప్తాయతప్రగ్రహం। బలి
దార్ఢ్యక్షితివేల్లదేజరిలు శృంగాగ్రంబుబ్రహ్మాండభాం।డతటికిఁ రాయలయా
బ్ధిగ్రమ్మగవెమీనపాణివై కేశవా॥ మ॥చరమాంగోగ్రనికర్షణద్రఢిమవజ్రకూ
రపాతంబుసం।స్మరణంబందెడిమందరాచలముభాస్వత్పృష్ఠపంబట్లుతే।జరిలక్
నీవునదాల్చికచ్ఛపమవై సంద్రంబునందుండిని। గ్జరరించ్ఛోళికనత్యయాపథపు
సారంబీవెమున్నచ్యుతా॥తారోర్వీధరకూటభాసితసురేంద్రప్రస్థరంబట్లుమం।
దారక్ష్మారుహదీర్ఘపుష్పనివసన్మత్తాళిమాడిక్కభవ। త్పోత్రియభ్యుద్రదనాగ్ర
దేశమునగోత్రిందాల్పవేమున్మహా। వారాశింగిటివైహిరణ్యనయనప్రాణాశు
గాహీశ్వరా॥సీ॥ కులగిరుల్నాసికానిలవేగమునగందుకంబులట్లుగురుచుగడలడా

ల్లి। చరణాహతిననదీశైలకానన సంయుతోర్వరాగోళము ట్టూతలూగ। చ
లితసటాఛటోజ్జ్వలవాతమునశింశుమారచక్రంబుబల్మారుదూల। నాళీకజాండ
భాండంబు ముహుర్ముహుస్త్రైవ్యక్త్రదారవంబులనొడ్డువార। నుగ్రనరసింహమూ
ర్తివై యొడసిభర్మ। కశిపుదేహంబుఖరనఖాగ్రములజించి। సరసభక్తప్రచారు
రాత్మసకుమారు। బ్రోవవే దేవదేవ సంపూర్ణభావ॥ మ॥ అశినైమెమిన్నొక
పాదపద్మమునడాయన్ మచ్చయయిసత్వభూ। వలయంబొండొకయంఘ్రిదే
శమునసంభావింపనాకాశమం। డలముం ద్విస్మితలమాక్రమించిబలినంటంగట్టివే
క్రిందికిం। బలిమిం ద్రొచ్చినవామనున్నినుసదాభక్తిం బ్రశంసించెదన్॥ చ॥ ద
విలిప్రదక్షిణించితిగదా జగదాక్రమణుండవైననా। డపలవిరోచనాత్మజుడహం
కృతిదక్కి భవత్పదాంబుజ। స్తవమొనరింపనాతనితోద్వారముచాయకనిల్చిబ్రో
తునం।టివిభువిభక్తిసాధ్యుడవునీవనవద్యకృపాపయోనిధీ॥ఉ॥సారవిలాసమూర
గవసంతపుమద్ద్వలగూర్చినైజవి। స్తారజయాంబుజావసుధపైబలుదోసిళులెత్తి
జల్లిన। ఘోరసమస్తరాజనివహక్షుతజహ్రిదముల్ ఘటించితె। ద్ధారలదీర్చితీవు
పితృతర్పణముల్ జమదగ్నిసూతివై॥

మ॥ ఖరవంశంబుననంటతాళములమ్రగ్గంజేసిహర్యుద్భవ। స్థిరదర్పంబు
హరించిఘోరవనరాశింజూడి మాద్యన్మహా। శరపుంజంబులవాయుజాతసహా
వాసపాధిబేరార్చిభా।స్వరమాత్వద్రఘురాడ్జనిప్రధితశుష్మంబెన్నగానేర్తునే॥
మ॥ భవదుద్యద్భుజశౌర్యపావకసముద్ధ్వాంతస్ఫులింగచ్ఛటల్।దివికింబర్వైనసం
బ్రిలంబసురవిద్విట్శీర్ష రక్తౌఘబిం। దువితానంబులు ఘోరముష్టినిహతిన్ ద్యో
మార్గమున్గప్పెనీ। భువివెల్గొందిన రేవతీశుసుయశఃప్రోతాశునిన్గొల్చెదన్॥ మ॥అ
నిశాసాధ్యపురాసురీసుచరితవ్యాక్షైణదింభోళినా। య్యానబాఘోషధీవాగురాల
తనుదాయంజేసిబంధింపనే। ర్పునసంధించినకట్టుకంబమననీబుద్ధావతారంబు
గుం। భినిబాల్పొందుసరోరుహోదరసుధీబృందారకస్మారుహా॥ మ॥ తతదోః
ఖడ్గసమీరుచేశబరమాద్యత్కంధరాళుల్సమీ। కతలచ్ఛద్మవిహాయసంబునవిభం
గంబందికీలాలముల్। క్షితికింజిత్రముగానొసంగదురగశ్రేష్ఠంబుపైబొల్చునిం।
బ్రితఘుస్త్రంబునుతింతునోకలికి రూపావార్థికన్యాధిపా॥ సీ॥ కౌశికుజన్నంబుగౌ
తమిబన్నంబుభరియించెహరియించెగరుణనెవ్వ।డీశానుచాపంబుభృగురాట్ప్ర
తాపంబుగారించెవారించెగడిమినెవడు। ఖరనిశాచరరాజు సరసిజాప్తతనూ
జు।శిక్షించెరక్షించెక్షితినెవండు।తటినీశుతోయంబుదశకంతుకాయంబునొండించి
ఖండించెనేఘనుండు। మాద్యశాశ్రితకోటికిమావధూటి। నెలమిలాలించెబా

లించెనెవ్వఁడట్టి॥ రాఘవుఁడవీవెకావెపురాణపురుష। మరచినీకెగ్గుసల్పితిమరువవలయు॥ ఉ॥ దేవకిపట్టివై వరదదీనజనావనతొల్లి విశ్వసృద్దేవుఁడు డాసి వేఁడజగతీభరమార్పజనించినట్టిల। క్ష్మావనితావిభుండవుసమాకతలంబులకంసముఖ్యుర। క్షోవరులంభయంకరులఁగొందరఁగూల్చితవార్యశూరతన్॥ క॥ క్రీడయపోలెగువలయా। పీడోత్సాహంబడఁచితివిగదకువలయా। పీడోత్సాహముగాఁగన్। నీరజసామ్రాట్తురంగనిశితరథాంగా॥ శా॥ నీవీయాదవమూర్తివయ్యఖిలజనానీకంబులన్ద్రుంపము। స్నీవిశ్వంభరబుట్టుఁదంచరసి మానీశావళుల్సెప్పఁగా। నేవింటింనినుఁగంటినిర్మలుఁడనంటింమంటిచాణూరర। క్షోవిరాసుసమీరవారికకరాత్కుద్రరగ్రామణీ॥

చ॥ అనివినుతించినన్ ముదితుఁడైయదువంశవిభుండుజాంబవం। తునినిజహస్తవారిజముతో సవరించుచుఁగూర్మిమించఁగా। వనచరితుండవార్యుఁడవుభక్తపరుండవునీసమానులెం। దునుఁగలరయ్యయంచుకృపదొట్టినబుద్ధిబ్రియోక్తిఁదేరిచెన్॥ క॥ అనియిట్లుశౌనకాదుల। కనువుగసూతుండుదెల్పనాలించిముదం। బునదేవిభావికథమా। కనఘావిననానతియ్యుమనిరక్కథకున్॥

శా॥ పాంథద్విద్యమగర్వదుర్వహాత్మమఃపద్మాప్తపద్మాప్తవా। గ్బంధుక్రత్వశనేణ్ణతిస్ఫురితపత్కంజాతకంజాతవా। తాంధోరాద్ధుతభుక్కిరీటకైకాలోకకాలోకహృ। ద్గ్రంథగ్రంధివిభేదనోద్యమనటత్సంధ్యానసంధ్యానటా॥ క॥ వీద్ధారాటసఖయువి। ద్విద్ధామకధర్మచిత్రవిగ్రహాదనుభూ। రాద్ధామకగోత్రశ్రుతిగో। రుద్ధామనిధిరథచరణరుచిమత్కరణా॥ పంచచామరము॥ ప్రణమ్యమానధాతృభూపురస్సరోదభుగ్గణా। గణప్రధానభక్తలోకగాఢరక్షణక్షణా। క్షణైకమాత్రవిష్టపౌఘసంక్షయాదికారణా। రణద్గుణాఢ్యవంశిరెడ్డిరామయార్చనాచణా॥౧౫౦॥

గద్య॥ ఇతి, శ్రీమత్కవితాచతుర తురగా వెంకయామరవాది రామయోభయకవిప్రణీతంబయిన శమంతకోదంతంబనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

సంపూర్ణము.

———



శ్రీ ర స్తు.



# తృ తీ యా శ్వా స ము.

క॥ శ్రీదయితజధకన్యార్యధు। రాద్రుద్ధృశవాశి రెడ్డిరామయభక్తా।సాది
తగోరంటపాత్రి।సాదని వేశాపటద్దిశాసోమేశా॥గీ॥ అవధరింపుము శౌనకాద్యఖి
లజటిల।వర్యులకు సూతుడిట్లనిబలుకునట్లు। సదయుడై కూర్మికృష్ణుండు జాంబవం
తు।నురుకరుణ నాదరించి గ్రమ్మరవచించె॥వ॥ దనరున్మత్పురిలోననొకఁరుడు
సత్రాజిత్తుడన్వాడతం। డనఘుండై రవిగూర్చి చేసె తపము త్యాస్థకసరోజాప్త
డా।యనకర్పించె శమంతకాహ్వయమణిన్ తద్రత్నమే గోరితి।మ్మనివాడీన నె జేరి
తంతటమదీయాగారమింపారగన్॥గీ॥ కడిమిసత్రాజిదను జుండు గాద్పవోసి।హ
యము నెక్కి శమంతకంబురుతదాల్చి।కాననకాఖేటనృత్తిమైగదలిపోయి।రామివగ
నొందినన్ను ఘోగముంగదూ౽॥ ఉ॥ తమ్మునికానలోపలహాతమ్మునరించి శమం
తకాఖ్యర।త్నమ్ము గ్రహించె గృష్ణుడుహితమ్మగునే యనునిమ్మ సూతివా। దమ్ము
లువచ్చ్రిపోంతరగతమ్ములు నైశితకంకపత్రపా।తమ్ములభంగిబొల్చినకతమ్మున
నేవనసీనుజొచ్చితిన్॥గీ॥ అరిగికాంతారసీమనాడాడగంటి। జీవములుజన్నహరి
నిప్రసేనుశవము।మరియుగనుగొంటినడిచి సామజవిరోధి। నొకఁచోవిగతాసు
వై యున్నదాని॥చ॥ అడుగులజాడనీగిరిగుహాంతరమేజొరబారివచ్చియి।కఁడగ
నుగొంటినిమ్మణిని గావలెమా కిదదీనివీడినన్। సడివిడిపోదునీమదివిచారముమాని
యొసంగిపంపుమి।ప్పుడుదడవాయమత్పురికిబోయెదజాంబవదృక్షనాయకా॥ఉ॥
నావినివాడుపల్కెఁయదునాయకనాయెడనింతభేదపున్। భావమునక్పైదేటికిబ్ర
పంచమునన్ భవదన్యమెద్దినా। జీవముసర్వవస్తువులు జేకొనసీయవికావె ప్రేమ
నే।డీవుశమంతకంబుగొనియేగుముమత్తనయాయుతంబుగన్॥ఆ॥అనివచించిస్వ
తనయాధాత్రిగనిజాంబ।వతినలంకరించివడిగదోడి। తెమ్మునాగనదిరయమ్మున
నెపథ్య।రచననూన్చిబుఱుకురాజుకడకు॥క॥ కొనిరాజాంబవతీదే।వినిగనికృష్ణుండు
మోహావివశుండై గొ।బ్బునహర్షలతలుహృదయం। బనుపందిరిబ్రాకనిట్టులనివ
ర్ణించెన్॥శా॥ శైవాలంబులనీటదోచిమఖవాశ్మశ్రేణులన్ ఘూసపుం। బోవుల్

మెక్కఁగజేసిఘోరిబలభృత్పుంజంబులందుర్గమ। గ్రీవాళింజరియింపబంచినలు
ప్పారంబంపు వైధాళిధ। ళ్యావిర్భావము లైదళంబులయి చెన్నారెన్ గురుల్ దీని
కిన్॥గీ॥ దీనిముంగురులళులె సందియము లేదు। గానిచోనివిభ్రమరకఖ్యాతిబడయ।
నేమికారణమానన తామరసము। పైనెసగనేల మేచకప్రభలనిగుడ॥గీ॥ ఈపెచె
క్కులగురులయందెల్లనాడు। ప్రకటమవ్యోమసోదర్య వైభవంబు। కంఠదేశంబు
నందువక్త్రంబునందు। భళిభళీయబ్జభావంబు పాదుకొనియె॥ఉ॥ సారమసారరో
చులనెసంగెడుభ్రూమిషకార్ముకంబులన్। నేరుపుతోడనేత్రనవనీరరుహోచ్ఛలకం
కపత్రముల్। గూరిచిధాత్రిపాంథమృగకోటిజయింపుచునీపెయౌవన। స్ఫారవ
నంబుచాయజలశంబర వైరివిలాసమూర్తియై॥ గీ॥ కంధరోర్ధ్వస్థలమునబ్రకాశ
మగుట। గళలనలరుటదీనివక్త్రంబునకును। శిశిరకరమండలమునకుక్షితితలమున।
వేరుగానంగబడునె భావించిచూడ॥గీ॥ సరసలావణ్యసుధనించి మరుడునిల్పి। నట్టి
దొప్పలెదీనిశ్రుత్యవయవంబు। లట్లుగాకున్నజూచుమర్త్యాళికనిమి। షత్వమబ్బుట
యిదినిదర్శనముగాదె॥ ఉ॥ మారుడయారెస్వారిదుహాబుమాయికిమందరసేయ
బోలునీ। సారసగంధివక్త్రమిదిసత్యముగానియెడన్ సదాశుకా। హారము లైదన
ర్చెడురదాంకురదాడిమబీజముల్ నవో। ష్ఠారుణబింబపక్వఫలమచ్చటదేజరిలంగ
నేటికిన్॥ఆ॥ కలికినాసచంపకముగానియెడనీక్షు। చాపదేశబంభరాళిపార్శ్వ।
ములనెసంగకంపమువహింపనేటికి। పరిమళంబులచటబ్రబలనేల॥మ॥ కలకంఠీమ
ణిచన్నులద్రిసుమీగాకున్న హారంబులన్। సెలయేరుల్ ప్రవహింపనెందుకొర
కక్షీణైణనాభిచ్ఛలో। జ్వలనీలాంబుదమండలంబనుసరింపంగారణంబేమిని। శ్చల
వృత్తస్థితిచేరసాస్పదతచేశస్తంబులేలయ్యెడిన్॥గీ॥ అంగజేంద్రుండునిల్పియున్న
ట్టియావ। నామృతపుకుంభములెయీమృగాక్షిచన్ను। లట్లుగాకున్నమెఱుగునూ
గారుచిల్వ। సామిడాసివసించుటకేమికతము॥క॥ నాళీకయుతములైనమృ। ణాళం
బులభంగియంగనకు పాణులతో। మేళనములగుచుమృదుబా। హాలతలలరారు
చుండుననిశమయారే॥ ॥ గగనముగాంచిమధ్యముము గాంగతరంగపరంపరల్
సుడిన్। దగబరికించిసవ్వళులు నాభిబిలంబునుసయికతంబురీ। తిగనినితంబమబ్జ
భవదేవుడు సృష్టియొనర్పబోలునీ। డుగనిటులుండునేయివికడుంబ్రతిగన్గొనిది
ద్దకుండెనన్॥ క॥ నిరతంబుజడస్థితిచే। శిరమెత్తకయుంటకదళి చెడెతొడలతో।
సరిరాజాలకలజ్జా। భరమునగాకొండుకలదెపరికింపంగన్॥ క॥ భావజనిషంగ
కములో। భావుకరుచియుతములయిన। వరిపొట్టలోజం। ఘాద్వయవముత్జాం
బవ। తీవనితకుభేదమింత దెలియుమభళిరా॥

క॥ బురదంజనియించిపపం। కరుహంబులుకఠినగుణముగలపగడంబుల్।
గురువిందరత్నచయమీ। తరుణీపదయుగళమునకు దరమేధరణిన్॥ మ॥ పగలే
డంగనరాకదొంగలగతిన్ ధ్వాంతంబునం దేరికంటగరాకుండెడు చోటడాసిచ
నుబెన్నుంజుక్కమొత్తంబులీ। నగవక్షోరుహపాదహస్తములవిన్నాణంబులొ
గోళ్ళక్రొం। జిగిచేనోటమిజెందెగాకకలదే జేట్పాటొకండుర్వరన్॥ క॥ అనివ
గ్గింంచెడుయదునా। ధునిగూడుకయున్నయెలుగుదొరగడకురయం। బునదాది
జాంబవత్యం। గనదోట్కానివచ్చునట్టికాలమునందున్॥ ఉ॥ ఋక్షపపు త్రికన్గొ
నియెనిద్ధసరోజదళాక్షుయాదవా । ధ్యక్షుజితాక్షుదాక్షసజయవ్రతదీక్షునజ
స్త్రపాండుభూపక్షురమాసముజ్జ్వలితవక్షుబుధావనదక్షువిక్రమత్య్రక్షునిజో
దరాంతరగతామిత పద్మభవాండలక్ష్మునిక్॥ చ॥ కనితలయూచిమెచ్చియిటు
కావలెనొచ్చిననోముపంటచ। క్కనిమొగడబ్బెనాకిపుడుకంతుజయింతవసంతు
లీడుగా। రనుపమరూపమందితనినారపురాతనజన్మవేళజే। సినమదగణ్యపుణ్యా
మువచింపగవచ్చునె బ్రహ్మకేనియున్॥ అనిమరియుదనలోనిట్లనియె॥ ఉ॥ లాలి
తశాతమన్యవశిలారుచిరంబఖిలాంగమింద్రశుం। డాలవుతుండమెంతటిఘనంబ
నినవ్వభుజంబులున్నతిం। దేలెడుమూపులక్షులతిదీర్ఘములై శ్రవణద్వయంబుబె।
జ్జాలబడందొడంగెను విశాలమువక్షమయారెవీనికిన్॥ గీ॥ రమ్యమగునీలమేఘ
సారంబుదీసి। వెసమసారరజము జల్లిపిసికిధాత। యుత్పలరసంబుతోబదునొ
సగివీని। జేసెగాకున్నగలదెయీజిగియొడలికి॥ ఉ॥ ఇందునిగేరునాస్యమున్పగెం
ద్రునిహాస్యమొనర్చుగౌనుబల్। సందెడునల్పులైనిడుపుసాగినకుంతలముల్ గవా
టము। ట్లందముగులుక్కుచుండునురమన్మకచెల్లశిరీషపుంజముక్ బందెముచేసిగె
ల్చుగదెపాదతలంబులువీనికారయన్॥

ఉ॥ వాతెరనూక్కిగుబ్బకవవక్షమునంగదియించిచేతులం। జేతులుదూ
ర్చిపట్టితమిచేతదొడల్దొడలంబిగించివీ। తేతరచింతమై మరగియీతని కౌగిటి
లోకిరానియ। జ్జాతదశాయ తేక్షణకు జన్మమదేటికిరూపమేటికిన్॥ గీ॥ అనుచు
సంజనితత్రపమైనతాస్య। యగుడుయదునాయకమణిహారాంతరగత। నాయ
కమణినిగనుపట్టినాతితదవ, లోకనావిఘ్నమున కెదలోననలరె॥ అంత॥ చ॥ అ
డుగులశోణకాంతులునఖాళిసితచ్ఛవులబ్జరాగపున్। దుదుముఱహారపంక్తులుగ
దోచుచుభూమినొసంగదికుఱలం। దొడ్డవిమెరుంగు దట్టముగనూనికడానియ
ల్లందినట్లుగ। నృడనుపమాతతోగలసివచ్చె సతీమణితండ్రిపాలికిన్॥ క॥ చనుదెం
చినజాంబవతి। వనితనుదొడమీదనిల్పివాత్సల్యముగొ। బ్బునమూరముద్దుగొనిక్ర।

ష్ణునితో నిట్లనియె బ్రియవచోయుతుడగుచున్॥ సీ॥ విభుడయీ శ్యామను ప్రథిత
ప్రసన్నభావంబు చెన్నార జేపట్టవయ్యా। యబ్జారిధారియీ యార్య నేకీభవింపగ
జేయుని మేననగణితముగ। శ్రీమ చేచతురాస్యయీ మంజువాణి నీమాటపట్టుననుం
చిమనుపవయ్యా। పద్మాభిరామయీ పద్మినికరముననంటియింపౌనరింపుమభినవము
గ। నంబుజాంబకయీ బుత్త్రపౌత్త్రజాత। ననవరత కేళిదేలింపు మాస్థతోడ। న
నుచుమణిసహితంబుగా। దనయనపుడు। కృష్ణునకొసంగెనలభల్లుకేశ్వరుండు॥
క॥ తదనంతరమునగూతురి। వదనము వీక్షించి బుత్త్రవల్లభుడనియెన్। సుదతి నీనో
ముఫలం। బిదుగో ఫలియించె విభుడు కృష్ణుండగుటన్॥ క॥ యికనిన్నిప్పుడు కోడం।
త్రికమునకుం జొచ్చినట్టి। నిలయంబునకే। న్నికపుట్టింటికి గిరితి। ప్రకటంబగునట్లు
మెలగవలెనమ్మ సుతా॥ మ॥ అనిబోధించి కుమారికామణిని గృష్ణాధీనగావించి
ము। స్వనజాతాసనదత్తమైదగు విమానంబిచ్చి వీట్కొల్పినన్। ఘనతద్రత్నపరం
పరాధికవిభాకాండోద్ధుతోగ్రాంధకా।రనికాయాద్రిగుహాందరించె హరిదా।రా
మాసమేతంబుగన్॥ ఉ॥ అంతకుమున్నె కందరముఖావనినిల్చినయాదవేడ్చమూ।
సంతతులారునారు దివసంబులుజూచి విభుండు రామికిన్। జింతవహించి ద్వారక
కు జేరి ప్రసేనునిజాడజన్నవృత్తాంతము శౌరిగహ్వరపదంబునజిక్కుటవిన్నవిం
చినన్॥ గీ॥ అప్పుడవ్వార్త నిర్ఘాతమట్లు వీను। లందునాటిన రాధాముఖాంగనా
ళి॥ దేవకీవసుదేవులు దీవ్రశోక। తప్తులై రెల్లపౌరులు తల్లడిలిరి॥ మ॥ కొడుకా
కంసముఖక్షపాచరులనుగ్గుల్ జేసి లోకస్తులం। గడగుండ్లంబడనీకమన్ని పృథురా
కాచంద్రసాండుద్యుతిం। గడవంజాలెడుకీర్తులెల్లెడల శృంగారించియున్నట్టి ని।
న్గడిగా ద్రిమ్మంగనెగహ్వరాననమునన్। గ్రావేంద్రుడు గ్రాటవిన్॥ ఉ॥ గారవ
మందియున్న చెలికాడును మేనమరంది పార్థుడీ। ద్వారకకేగుదెంచి ప్రమదమ్మున
మాకడనిల్చి బావగా। రేరియటంచుమమ్ముడుగనేమి వచింపగనేర్తు ముగ్రకాం।
తారమునందు ఘోరవసుధాద్రబిలంబునజిక్కెనందుమే॥ ఉ॥ గారమునీయడన్
మిగులగానిడియున్నలతమ్ములందిర। సాకరమొనర్చి నిన్నువిభుగా వరియించిన
సాధ్వి రుక్మిణీ। వారిజగంధి కొందలము బాపగజాలుదుమెట్లు సేగిము। న్నీరుద
రింపనేరుతుమె నీరజలోచనసుకుమారకా॥ మ॥ రతనంబుల్ మనయింటలేవె సు
తసత్రాజిత్తురత్నంబుగో। రితివీవెందుకొకందు దుర్యశము బర్వించంగ దానిం
న్వని। షుర్ప్రతిగావింపగబోయి కొండగవిలో జిక్కొందితౌ మర్త్యుడీ। క్షితి
దానాకట్టిదల్పదైవమొకటిన్ సిద్ధింపజేయుంగదే॥

సీ॥ తొలుతసత్రాజిత్తునిలయంబునందున్న। రతనంబు గాంచి గోరంగనే

ల। గోరితిబోయీకమీ రెగాక ప్రసేనుడరుత దాలిచి వేటకరుగ నేల। నరిగెబో
కాంతారమందు గ్రకేసరిశాతనఖంబులజావ నేల। జచ్చెబో సత్యమెంచకనిమ్ము
సూతియూదుషీర్త్రిసీమిద। దొలుపనేల దొలిపెబోయూచకటఖనిదూర నేల।
దూరి వెదకితిగాకంధకారభరిత। కుధరగుహజొచ్చ నేటికికొడుకయిట్టి। కధకు
మణిసీవడుగుటయే కారణంబు॥ ఉ॥ గట్టుసా రెన్నిగాఢముగ గార్కొనుచీకటిలో
నమార్గమి। ట్టట్టనిదోచకునికి భయమందిననించితి వాకొకసింగముల్। రట్ట
డిమ్రొల్గు రేండ్లజగరంబులు మ్రింగనొవంతనొందుచా। పట్టునమమ్ము నేమియనిప
లికితివొకదసాతనూభవా॥ క॥ అనియివ్విధమునసిజనం। దనుడగుహరిగూర్చి
వగచుదల్లినితండ్రిం। గనిహలియొగాలోకన। మొనసివచించెన్వివేకహితవాక్య
ములన్॥ మీరింతయుంగలాక్షైద రూరకకృష్ణునిసుతునిగనూహింపకుడీ। నా
రాయణుండులోకా। ధారుడతనిమాయదెలియదర మేరికగున్॥ సీ॥ పసికూననా
డురకొసిచన్నులవిసంపుపాలతోనసువులుగ్రోలలేదా। పిమ్మటబండిరేద్రిమ్మరి
నరకాలు జాడించిచిరుసుగ్గుసల్పలేదొ తరువాతనలచుట్టుకరువలి రాకాసికు
త్తుకబిగియించిగూల్ప లేదొ। యావెనకనడుమగోలడ్డంబుగానిడ్చిపొడవులౌ మ
ద్దులుగెడపలేదొ। చంచువులజీల్చిబకునిమాయించలేదొ। కాళియొరగుమదమూ
డ్చిదోలలేదొ। యవిమనుష్యకృతంబులేయరుకదప్పి। కృష్ణుగూరిచివగవంగ। నేల
మీకు॥ ఉ॥ ఆతెరగైననీవరకహస్కరచంద్రులుబండిగండ్లుగా। భూతలమందు
డొల్లరెనభోవలయంబునమోతపుట్టదే। భీతిలరేహరిద్వరులు బెగ్గలమందవేది
గ్గజంబులు। భూతలొసంగ వేధరకుడుతకరముల్గతిదప్పికూలవే। సీ॥ అఘటిత
ఘటనావిహారుడంటకుజచ్చి। ప్రతికినసాందీపసుతుడుసాక్షి। యఖిలభారధురీ
ణుడగుటకుపసులకై కరమందునిల్పినగిరియెసాక్షిసృష్టికరుండటంచెన్నుటకజహ్వా
తార్భకవత్సకప్రతిరచనసాక్షి। జగదవనుండనినెగడుటకడవిచిచ్చుమ్రింగిస
ఖులబ్రోచుటయెసాక్షి। ప్రళయసంతంభుడనుటకు బలవదసుర। మారణము
సేయుటయెసాక్షిమరచినారె। కృష్ణుడుజనించునెడజూపుస్వర్ధరూప। మతడు
హరియనియూహింపుడాత్మయందు॥ వ॥ ఇట్లుబోధించినబలభద్రువచనంబులా
కర్ణించిదేవక్యానకదుందుభులూరడిల్లి కృష్ణోపసర్పణసమర్పితాత్మదృగ్వ్యా
పారులై యుండిరంతరాధాదిగోపవధూజనంబుఖేదొన్మాదులైపీడినకచభరం
బులతోవాడినమోముదామరలతోవడిబారుకజ్జలాశ్రుఝరంబులతోదిగజారునీ
వీబంధంబులతోపెకపెకలాడువేడినిట్టూర్పులతోతుకతుకనుడుకుపాటలాధరం
బులతోచికుకలైనహారవల్లికలతోపెకుకవయిననిజసఖీసముచితాలాపంబులం

దేరికృష్ణకృష్ణేతివాక్యంబుల వెక్కివెక్కి వాపోవువారును తొల్లియదువల్లభుతో
జూదంబులాడుతరియతండోడిన క్రమాగతైణాంకముఖీ సురతంబుమానినిజప
ర్యంకంబునకేతెంచునట్లుదమరోటుపడ్డతదాజ్ఞావశంబుననుండునట్టులనుడిపికో
సితారుజయించివిజయసఖుతోభోగించిన దంత్తయున్ దలంచివిలపించువారు
ను। యదురాజన్యనందన్యకన్యాశ్లేష దోషంబాపాదించి పరాఙ్ముఖంబుగా
బరున్నయెడనావెన్నుండు మన్ననచేలాలించి గాఢోపగూహనంబొనర్చుటలెం
చియుంమ్మలించువారును। చరమాంగంబునగిల్లంటునటింపమేఘలాదిపరిష్కా
రంబులువొదలిడసల్పినపురుషాయితంబునకానందించి నందనందనుండుమెచ్చి
పలుకుసల్లాపంబులూహించి యాహాకారంబులుసల్పువారును ఘనసారకృష్ణ
సారమదకాశ్మీరద్రవంబులతో జగన్మోహనుండగు ఖగాశ్వుండుస్వకపోలపా
ళికాకుచోపములరచించిన మకరికాపత్రనికాయంబులసోయగంబులు స్మరించి
బురబురబొక్కువారును సారమసారవిభాసారస్యంది శరీరుండునుసుందరమం
దస్మితుండునుకురువిందకందళరదనుండునుశుండాలశుండాదండోపమానభుజా
దండుండును। కుశేశయవిశాలనయనుండును। మణిఖచితమకరకుండలఘృణిధగ
ద్ధగితగండయుగళుండును। నగునగధరునీజన్మంబున జూతుమేయనువారును।
యీసత్రాజిత్తుగల్పించినయపవాదంబింతకుదెచ్చెనేయనువారును। నైపూర్వం
బునశార్వాణే సపద్యాధుర్యతనహార్యధారిని ప్రాణేశ్వరునిగా బడయుటంజేసి
తత్ప్రసాదంబున యేతదాపదపనోదనంబగుననిదలంచి పంచముఖప్రియాకాం
చనావసథంబునకేతెంచి విద్యుక్తప్రకారంబుగా బూజించికరకమల ఘటితని
టలతటలై తటిదాలోకనలప్పుడు॥

క॥ అంబేందుసుందరానన। బింబేమ్మృదుగమన విజితపేచకవరకా। దం
చేవసితకదంబక। దంబేనఃపాహియనుచుదండములిడుచున్॥ చ॥ గళములసుస్వ
రాళిసెలగన్వచియించిరి దేవిమాకమం। గళముగదమ్మమద్విభుడుగ్రమ్మరనిం
టికిరాకయున్నన। గ్గలముగదమ్మనీమహిమగాఢతదాశ్రితదుఃఖవార్ధికిన్। గలము
గదమ్మనీకృపతమంగలకాలముసర్వమంగళా॥ శా॥ ఆలాపేందుముఖీరమాద్య
మరకన్యాభవ్యసీమంతసం । ఘూలీఘారుణకుంకుమాకృతపదోద్యద్దీధితీచంద్ర
మో। హేళీకుండలిధూమ్రలోచననరాశీంద్రాసుదంభాశుగ। వ్యాళకాళినతాళి
కింసురనగంబేనీకటాక్షుంబిలన్॥ నిన్నసూయాదృష్టిగన్న కిన్నెరనాదుకన్నుగు
డ్డుబుకదేగవ్వమాటికి। త్వన్మహత్వంబుభావమున మెచ్చనిభృంగిదిటదప్పితూ
డేత్పణముభంగి। నీకపకారంబునెరపినదేవతల్నిరపత్సతాయో గమిరవుకొన

రె। నీతోడకలహానకే తెంచినట్టి భండాసురప్రముఖులుహతులుగారె। తల్లినుత
దేవకాంతామతల్లి నీదు। పదములెదనిల్పుకున్న సంపదలుగలవె। పంచజనపాళి
కాపత్ప్రపంచమూడ్చు। సదయవై బ్రోవగదవమ్మసదయమొసగి॥ చ॥ యిటు
లనుతింపుచుక్ జలరుహేక్షణలాగిరిధన్విరాణిచెం। గటనిడినట్టి ధూపములు
గారొగినుధూమపరంపరల్విశం। కటముగజేజరిల్లెవర గంధవహోచ్ఛలభర్తృది
క్సతీ। పటలకపోలపాళికలవ్రాసిన సన్మకరీచ్ఛదంబులై॥ క॥ వెండియుభక్తినొ
నర్చున। ఖండార్చనకంబమెచ్చిగరితలకనియెన్। కుండలిశయనుడుయాదవ। మం
డనుడేతెంచునికరమణితో మణితోన్॥ గీ॥ అనవుడాగోపకాంగనాజనులుప్రా
వృ। డంబుదస్తనితారవాహ్లాదినీల। కంఠములమాడ్కినతులితోత్కంఠలైరి।
పార్వతీమందిరోజ్జ్వలప్రాంగణమున॥ క॥ నింపారగనాపురిఘం। టాపదమున
పౌరజనులెనసిఘనవాద్యో। ద్దీపితరతులెసగకుభృ। చ్చాపసతీమణికిమహాము
సాగించుతరిన్॥ సీ॥ మొదటప్రత్యగ్రణమదసంకుమదభూరిగంధగంధవహం
బుగ్రమ్ముకొనియె। దదనంతరమునసుద్గాడగుంజన్మంబు ఘణఘణతాకారసంఘ
ములుబలసె। నటుబిమ్మటనునమోహరమేముకుందాయయను ననులాపంబు
లావరించె।నాపిమందపురందరాశోదయారుణారుణఘృణిసమకాంతులుల్లసిల్లె।
సింగినాకకొంతవరకు మానిన్పపేత। హరియనుచుఘంటికాచ్ఛటలనుచునార।
దాదులనుచు మణివ్యోమయానమనుచు। జనములుగ్రీవులై చూడ శౌరివచ్చె॥
క॥ ద్వారకవీటిగజారి। ద్వారకనత్ప్రాంగణమునకల్లనజలద। ద్వారకమార్గ
మునజగ। ద్వారకరుడుశౌరిడాసె। సకుతూహలుడై॥ ఉ॥ డాసియుఁరోహణా
చలవిటంకముడిగ్గుసచంచలాభ్రమ। ట్లాసుగుణాభిరాముడుమురాసురభేది ఖగ
ధ్వజుండురా। మానసముపేతుడైయలవిమానముడిగ్గిననాశ్రితుల్సఖుల్। ఉష్మో
సుసులేగుడెంచియరుసంబలరారగగాంచి రత్తరిన్॥ క॥ కనుగొనిదండములా
లిం। గనములుదీవెనలూసంగనా కృష్ణుండం। గనతోనారోహించెన్।శినవీరానీ
తగంధసింధురవరమున్॥సీ॥కంసరక్షోవీరగంధేభహర్యక్షజయజయయనిభటు
ల్సన్నుతింప।నఖిలదిశాకుడుంగాంతరంబులు వీణలనతులధకోగ్రధాంకృతులె
సంగ। నారట్టజాదివాహారోహులై పార్శ్వములనురాహుత్తుకోటులుసెలంగ-
తపనీయరౌప్యవేత్రంబులెత్తుకునిముందరకంచుకులు బరాబరులుసల్ప। సాత్యకి
సువృత్తమౌక్తికఛత్రమూన। దండలను జేకితానుడుద్ధవుడుచామ। రములువీ
వంగద్వారకారాజధాని। రాజమార్గంబువట్టెనారాయణుండు॥ రాజపథము
నరాగవారసతులాడ। నాడముంగలనాడ పౌరాళులెల్ల। నడువసాగిరిసందీక

గడుముదంబు। దనరవార్ష్ణ్యశ్రేష్ఠితాంగనాజనులు జెలఁగ॥ సీ॥ విధునిమీదను మం
చివిమలతా కాన్తీ కముబుజల్లి జెల్లునంచలరెనొకతె। నీరదమూర్తిపై నెలతయొ
కర్తె తెఘనపుష్పంబులిడియువిబోలుననియె। సర్వజ్ఞనౌదలచంద్రఖండములొకర్తె
యతివవిదిర్చిచాగనుచునవ్వె। నలధనుంజయమిత్రనందుగంధముజిలికర్తె। క్రమ
మిదియనిమెచ్చె కలికియోర్తు। మరియులాజాక్షతాదికమహితవస్తు। సమితిమే
డలపైనుండిసకలభామి। నీనుణులువృష్టిగావింపనిరుపమాన। విభవమునజేరె
హరినిజలేశ్వమునకు॥ ఉ॥ స్వాయతనంబుజేరినరకాసురమర్దనుడాప్తబంధులం।
బాయనికూర్మికౌగిటనుబట్టుచు తల్లినిదండ్రిడాసిబే్రి। మాయితబుద్ధివారిచర
ణాంబుజముల్ నొసలంటమ్రొకెకర్తె శ్రీ। రాయుధుపాదయుగ్మమునకంజలిసల్పెను
భక్తియుక్తుడై॥ క॥ చచ్చిమరలజీవితుడై। వచ్చినవానిగనినట్లువసుదేవాదుల్।
జెచ్చెరనక్కునజేర్చిరి। పచ్చనిదూవల్వదొరను। పరమప్రీతిక్॥ వ॥ వెండియు
హేమచేలుక్ గనికామపాలుండిట్లనియె॥ చ॥ రతనముదేదలంచివనరాజికిబో
వుటయుంగతాసువయి। క్షితిబడియున్నవాజినిప్రసేనుశవంబుబ్రమీతవారణా।
హితతనువుంగనుంగొను చగేంద్రబిలాంతరమందుజంటభృ। త్సతతివచింపవిం
టిమనుజాతదనంతరవార్తదెల్పు మీ॥ మ॥ అమరీసంఘములంగణింపదురగశ్యా
మాతతిన్మెచ్చదు। త్తమవిద్యాధరకాంతలందెగడుసిద్ధస్త్రీలనగ్గింపధీ। రమణీ
రత్నమునిస్తులాకృతినిగోత్రామధ్యమందీపెజ। న్మమునక్ ధన్యతగాంచినట్టిఘను
నిం। బద్మోదరా చెప్పుమా॥ క॥ అనవుడుమధుసూదనుడ। న్ననుజూచివచించె
వినుమునావృత్తాంతం। బనఘాజెప్పెదనాగవి। జనిజనిబొడగంటినొకర్తె సరసిం
దొలుతక్॥ ఆ॥ దానిఘాటిపోవగానంగబడెనొకర్తె। సాలమందుజొచ్చిసనగ
హెూర।సౌధమెదుటదోచెజనిమెకర్తె యలశమంతకముగంటినందుధర్మచరిత॥
ఉ॥ మానికమేగ్రహింపనొకమానినిరద్దియొనర్చెనంతజాం। బూనదశైలధైర్యు
డునభోమణితేజుడునీరజాతభూ। సూనుడుజాంబవంతుడనుశూరుడుదాకగ
పెకర్తె నాళ్ళుబో। రైనదదాహవంబునజయంబొదవెక్ దుదినాకునగ్రిజా॥
క॥ ననుప్రస్తుతించిస్వప్రియ।తనయానుమణినిచ్చి బుక్షధవుడంపగవ। చ్చినవా
డననుచుసకలం। బును జెప్పిననచటివారుబొంగిరిమిపులక్॥

క॥ ఆదటకృష్ణుడుజాంబవ। తీదేవినిపెండ్లియయ్యెదిరమగుగర్గా। వ్వాది
తశుభలగ్నమునబ। లాదియదుప్రభువులెల్లనానందింపక్॥

అంత॥ సీ॥ బంధురైశ్వర్య ధౌరంధర్యబంధూకృతాంధకపరులకునంధకపరులరిభుజాగర్వదుస్తరవనీహరణక్రియాదవులయినట్టియాదవులును। సకలధర్మక్రమేచ్ఛలసస్యచయ వృష్టిపావనులగు వృష్టిపావనులును। ప్రకటాత్మకీర్తిందు సుకుళితాహితముఖాంభోజరాజులయినభోజరాజు। లాదిగాలతగవరులయినపార్థిన్। వాగ్రణులు భాంధవులుహితులార్యవర్యు। లందఱాస్థానమునదన్నుసధికభక్తి। కలితులయికొల్వపేరోలగంబుదీరి॥ శా॥ రాజీవాయతపత్రలోచనుడుసాంద్రప్రేమతోనపుడుసత్రాజిత్తున్ స్వసభాంతరాళమునకున్ రావించిమర్యాదగా। నోజింజారుసువర్ణపీఠమునగూర్చుండన్ నియోగించివే। రాజన్యాధికసభ్యులెల్లవినసత్రాజిత్తుతోనిట్లనున్॥ వ॥ అయ్యాభవదనుజువనిదునిమిశమంతంబుహరించినాడనని నీవానర్చునిందాభారంబుభరింపనోపక తదన్వేషణాయత్తచిత్తుండనై కాంతారంబునకరిగితినందొకకేసరిహంబువిధివశంబుననీసహోదరుందెగటార్చిన తదీయరత్నంబుగొనిపరచిననాహర్యక్షుంబుబుక్షమలాఢ్యత్ముండగు జాంబవంతుండు జెండాడితద్గతంబగు శమంతంబుగైకొనియెననవ్వీరవరుపరాక్రమంబునజయించితదీయరత్నంబుదెచ్చితినిదుగోగొనుమిచ్చెదదనసియొసంగిననాదివ్యరత్నంబు బుచ్చుకునినిమ్నానందనుండునితాంతత్రపాభరంబునలజ్జావతియునుంబోలెశిరంబువంచుకుని పశ్చాత్తాపంబు నొందుచుగృహంబునకుంజనిమనంబున॥

క॥ బలవంతునితోవైరము। కలిగెగదాయెట్లుబ్రతుకకలవాడనికన్। జలజాక్షునకప్రియమున్। సలిపియవంద్యైనమనగశక్తుండగునే॥ క॥ దురితాత్ములదురితంబులు। దొరగించుమురారిమీదదురితంబిడు। దుష్కరశీలునిదురితపరంపరకునహో మేరకలదెపరికింపంగన్॥ మ॥ ఇలనెవ్వారెటువంటివారయినదూహింపగవేకూరక। జ్జలజాతేక్షణునేలదూరితిధనాసక్తుండనైగోరమున్ దెలియంజాలనెనర్థలోభుడమదాంధీభూతచేతస్కుడం। గలుషాత్ముండజడుండనేమిటికినీకాయంబయోకాల్పనే॥ క॥ భగవంతుడైనహరికిం। బగతుడనైతింజగంబుబదరగబడితిన్। దెగువంజేసినఫలమిది। దిగులేటికిజేసుకున్నదిగుడువవలదే। శా॥ దూరాన్వేషణమాచరింపకహరిన్ దుర్వాక్యముల్బలికితి। ద్వారాఘంబుఘటించుకొంటినికనేభంగిన్ దదీయ్యాగ్రహమున్। దీరుంనాయపరాధమేకరణిదైతేయారిసైరించునిం। పారంనాయడన్నాత డెప్పగిదినిత్యంబున్ దయాళుండగున్॥ వ॥ అనిచింతించిసత్రాజిత్తుండు క్రమ్మరనెమ్మనంబున॥ ఉ॥ మామకమంతుంశాంతిగశమంతమణిన్ మరికన్యకామణిన్। ప్రేమశుభాచరిష్ణునకుగృష్ణునకి

చ్చితదంఘ్రులందును। ద్దామప్రభక్తిమ్రొలినకదా బ్రతుకటు సేయుచున్నని౦। కే
మిటిచకఱగాదితరవృత్తినినాకిదినిశ్చయంబుగన్॥ చ॥ అనితలపోశియంతసుష
మాత్తదిగంతమునాశమంతమున్। ననుచుజగామిటూరిరతినాథుకటూరినిసత్య
భామనా। ననుగుకుమారిదోడుకొని యాదవముఖ్యులుగొల్వరీవివేప। రాఁగన
గొలువున్నశౌరికడకుంజనిమ్రొక్కిఱ వచించిదీనతన్॥ సీ॥సహచరీకృతగోపశాబ
కదంబకబకనైత్యభూధరప్రబలశంబ। శంబరాసురవైరిసంజననాస్పదపదయో
గపుణ్యీభవత్కువలయ। కువలయాపీడనకరిరేభనాశకశకటదానవరాజజయ
నివాస। వాసవవర్షితోపలవృష్టివారణవారణరిపుసన్నిభప్రతాప। తాపకర
ఘోరతరదావదహనశమన। శమనజాదికబాంధవసఖ్యపరత। పరతమోస్త్రగ్ర
కంసనంహారణకరణ।కరణజిన్నుతసద్గుణాభరణకృష్ణ॥

శా॥ దేవ స్త్వచ్చరిత్రమునింనినుమహాంధీభూతత్తుండనై। భావంబందుభ
వత్ప్రభావముదలంపక్ లేకనిర్వ్యావ్యమి। ధ్యావాదంబొనరించితిన్మదపరా
ధంబుల్గృపన్సైచవే కావాచాళునినర్థలోభునితమోగ్రస్తున్ననుంబ్రోవవే॥
క॥ చేసినతప్పెడలగనే। దాసునినైతింకనన్ను దయజూడదగున్। దాసునితప్పె
చివండమ।తోసరియనుమాటనిజముదొరయింపుమయా॥ క॥ భక్తజనవాత్సల్యుం
డవు। భక్తుండొనరించునట్టిపాపనిదానా। వ్యక్తాలోపములుదయా। సక్తిన్మ
రువంగవలయుజగదవనకరా॥ చ॥ ఇదెయపరాధశాంతికయియిచ్చెదమత్ప్రి
యకన్యసద్గుణా। స్పదశుభలక్షణాంగి కులపావనినీచెలి నర్మదత్తమ। స్మదఖి
లవైభవాకరము చారుశమంతము గొమ్మటంచుభ। క్తిదనియనిమ్నసూనుశా
సగన్హరికిన్దనయామణిం మణిన్॥ చ॥ తమినతడట్లొసంగహరితత్తనయా
మణులంగ్రహించిహ। షణమునకుమారికామణినొసంగితి మాకిదిచాలుమాని
శాం। తమునననేకరత్నసముదాయములున్నవి గొమ్మటంచువే॥ మమెసగని
మ్నసూతికిశమంతకరత్నమునిచ్చెగ్రమ్మరన్॥ఉ॥ అంతటసత్యభామనుపయామ
ముగావసుదేవరేవతీ।కాంతముఖాత్మబాంధవనికాయమునానతిగర్గముఖ్యకా।
ర్తాంతికకోటిచేత విదితంబుగనిమ్నజుసమ్ముఖంబునం। దెంతయుదైత్యసంహార
ణుడేర్పరుపించెనుసన్ముహూర్తమున్॥ మ॥ దనకున్శౌరిప్రసన్నుడయ్యెదనతా
త్పర్యంబుసిద్ధించె।నంచునితాంతప్రమదాబ్ధిదేలుచునునచ్చోవాసుదేవాజ్ఞనై।కొ
నియుద్వాహశుభప్రయత్నమునుజేకూర్పంగ దానింటికిం। దనపేర్మింపుతనూ
జదోడుకొని సత్రాజిత్తుడేగన్ వెసన్॥ క॥ ఇరుదెరగులవారపుడె। వ్వరిపైపు
నవారమేయ వైభవమెసగం। బరువడిసమకూర్చిరిధా। సురవైవాహికస

మ స్తశుభసామగ్రికా॥మ॥అపుడప్పట్టణమొప్పెనున్నమితహర్మ్యస్వర్ణకేతూత్క-
రం।బుపవిత్రీకృతరంధ్రితేట్పథముసంఫుల్ల స్రగాళీనిబ। ద్ధపురద్వారముభూరిచి
త్రరచనోద్యత్కుడ్యముద్వేలవా। ద్యపరీతంబుపయామవీక్షణస ముత్కంఠీభ
వత్పౌరమై॥వ॥ మఱియునిమ్మనందనుమందిరంబుచందన పంకపంకిలతలంబునుజ
లధరాయనసముచ్ఛ్రాయామేయకాయమాన నికాయప్రాపితంబును మౌక్తి
కరంగవల్లీతరంగితప్రాంగణంబున జారుగారుత్మతద్వారతోరణంబును విశం
కటరాంకపవితానసంతానితంబును నక్షీణగవాక్షనిర్గతాగరుసాంబ్రాణికాధూ
పధూమఘనీభవద్ధూమస్తోమసందర్శనోదితాదభ్రనవాభ్రభ్రమసంభ్రమితప్రో
షితమయూరకలకాకలీకేకారవసంకులంబును అఖండపుండ్రేక్షుదండప్రకాం
డమండితంబును సముత్తంభితరంభాస్తంభవిలాసంబును నాభోగపూగనాగవ
ల్లీమతల్లికావేల్లితంబును వివిధసుహృద్బాంధవవసుంధరాసుధాంధస్సందోహ
బంధురంబును నశేషభూషావిశేషపుణ్యాయోషాభూషితంబునుజారవారమనో
హరమనోహరోపారవార వారణగామినీనాట్యచాతురీవిరాజితంబును ననవ
ద్యవాద్యనిర్ఘోషణఘోషితంబును నై యగణ్యకళ్యాణమహోత్సవవితానంబున
కుదానకంబై సుమనఃపరిష్కృతంబుగావునసురాలయంబును ముక్తాభిరామం
బుగావున వైకుంఠంబును సహంసకగణక్వణనీపద్మినీభాసురంబుగావున సరోవ
రంబును రాజకుమారభూషితంబుగావుననలకాపురంబునుబోలియొప్పెనప్పుడు॥
క॥ సత్రాజిత్తునసుజ్ఞక।సాత్రాజితిపెండ్లికూతుసరిగవినోనర్పక।గోత్రామరపు
త్ర్యాంబుజ।నేత్రల్ సమకట్టుమిగులనెయ్యంబెసగక॥చ॥ స్తుతమతిసత్యభామనువి
శుద్ధగృహాంతవిశాలవేదికాం। చితమణిపీఠసంస్థితనుజేసిధరాత్మభవాధరాత్మ
జా। పతిపరిణీతిగానములుపాడుచుబోడిమిశోభనంపుటారతులిడిశోభనోత్సుత
పరంపరనాదలరాల్చిరంతటక॥గీ॥ కమ్మనూనియదలయంటెగొమ్మయోర్తు।నవ్య
గంధామలకమునలుగుబెట్టె।కలికియోర్తువిశుద్ధోదకములజలక। మార్చె నాస
త్యభామకునతివయోర్తు॥చ॥ పలువిడినొక్కనాతినునుపావడమైచడియొత్తిస
న్నపుక।వలిపెమొసంగెనొక్కతెనువరణమయాసనవాసమైనతో। య్యాలికివినీ
లకుంతలములార్చినవాగరుధూపమిచ్చి వే।నలిఘుటియించెనోర్తుమృగనాభికబొ
ట్టులలాటమందిడెక॥చ॥ కలికియొకర్తుచందనపుగంధముమేననలందెజగ్గునిక్ గ్గుల
దులకించుకాంచనదుకూలమునోర్తుకటిక ఘటించెద। కుల్కలగనిజంటముత్తియ
పుకుట్లజగాకుబుసంబునొక్కప। లుక్కలవగలాడిచన్నుగవగుత్తముగాదొడిగెం
గమారికిక॥సీ॥ బాలికామణిశోణపాదనఖశ్రేణిలాక్షారసముబూసెలలనయో

ర్తు। జలరుహాననపాదములయందు మంజీరములు ఘటియించెఁ బైదలి యొకర్తు। నెల
తగానునగింకిణీకనత్కనక కాంచీదామమమరించె జెలియయోర్తు। చెలిభుజాపా
ణ్యంగుళులవరాంగదకంకణార్మికల్ గ్రైసే సెనువిదయోర్తు। వెలదికంఠంబునందు
గ్రైవేయకాచ్ఛహారవల్లులు గీలించె నతివయోర్తు। మెలత సీమంతవీధిధమ్మిల్లమం
దు। జేసుచుక్కయు నసరుల్ జెరివె నోర్తు॥ చ॥ క్రమమున బత్కృవీధికల కజ్జలరేఖలు
దీర్చె నోర్తుక।ర్ణములసువర్ణకర్ణికలొనర్చె నొకంగన నాసికాగ్రమం।ధమలపుటా
ణిముంగరల దాంగి యొకర్తు ఘటించె నిల్వుటా। ద్దము రహి జేతికిచ్చె నొక తామరసే
క్షణసత్యభామకున్॥ క॥ ఈకరణిశుభోచితనా। నాకల్పాలంకృతాంగియై పా
ణిగతా।స్తోకాదర్శమునందా। త్మాకృతిగనుగొనుచు నిమ్నజాత్మజయుండెన్॥ వ॥
అట్టివైవాహికోత్సవోచితాపారపరిష్క్రియాపరిష్కృతంబును। బహుళసుహృ
ద్బాంధవాదిజనపరంపరాభరితంబును। నసాదవాదిత్రనినాదమేదురంబునగు నిజ
భవనంబున భువనాధ్యక్షుండగు పుండరీకాక్షుండఖండకౌతుకంబున భవ్యగీతో
పేతమంగళాగాత్రికాపూర్వకంబుగా సరసహరిద్రామలకచూర్ణాది శోభన
స్నానీయద్రవ్యంబుల బుణ్యాంగనలొనరించు నభ్యంగనంబంగీకరించి పీతాంబరధ
రుండును నాలేపితాంగరాగుండును నవీనహరిణమదతిలకాలంకృత లలాటఫల
కుండును మాళికావలద్బర్హిబర్హావతంసుండును వ్యక్తముక్తాదామకాముక్త
కౌస్తుభమణీధురంధరకంధరుండును మకరకుండలకేయూరకంకణకిరీట ప్రము
ఖనిఖిలభూషణభూషితావయవుండును వనమాలికాకీలితవక్షోభాగుండును నై
మొగంబున జిరునగవంకురింప బెండ్లికొడుకై యొప్పె నప్పుడు॥ చ॥ కవిసెముహూ
ర్తమంచు వెసగర్గముఖద్విజులెచ్చరింపయా। దవపతితూర్యముల్ మొరయ దారక
కీలితసైన్యముఖ్యసైం। ధవగరుడధ్వజంబగు రథంబున మైకనకాంబరంపుచా। యవ
రలనెక్కె బాల్చెకుధరాగ్రవసత్సతటిద్ఘనాకృతిన్॥ శా॥ మ్రోలన్ భూర్యనివా
ర్యతూర్యచయముల్ మ్రోయంగ నమ్మేటిపా। ర్శ్వాలన్ స్రగ్యుతపుండ్రదండము
లుజంచచ్చామరవ్రాతముల్। గ్రాలం బ్రోన్నమితంబులై యుపరిభాగంబందుము
క్తాతప।త్రాళుల్ దీండ్రిల బెండ్లికిం దరలె నబ్జాక్షుండు హర్షంబునన్॥ క॥ ఆకరణిర
థారూఢుం।డై కృష్ణుఁడు దరలుటయు రయంబున ధృతనా।నాకల్పులగుచు బ్రేమో
ద్రేకత నొండొరులదీవరింపుచు గూర్మిన్॥ సీ॥ సొంపైన మాహురీ కెంపుటంచారీల
నింపారు గౌరుల నెక్కువారు। నాణెము త్రైపుకుచ్చుటంచుల పింజరీ లేపారు పల్లకీ లె
క్కువారు। హౌంబట్టు పల్లాలహొరుమంజి కైజాల నెసగు హుమాయీల నెక్కు
వారు। నెరిరవల్ జెక్కిన గెరలు నాగల్ గల చొకటంపు టరదంబు లెక్కువారు। నగ

చువను దేవనందోద్భవాచ్యుతాగ్ర। జాతశైనేయమకరధ్వజప్రధాన। యాదవప్రభులందరా మోదలీల। దానవాంతకు వెను వెంటదరలిరపుడు॥ వ॥ ఇత్తెరంగునను త్తుంగమాతంగతురంగశతాంగాదులారోహించి నిజపితృభ్రాతృప్రముఖనిఖిల బంధుసందోహంబులిరుగెలంకులసమ్మదమ్మునగ్రమ్ముకొనిచను దేర దేవకీరోహిణీరేవతీరుక్మిణీప్రభృతిశుద్ధాంతసంతతికమనీయతపనీయ డోలికాపాళికలుచరమరస్థలినరుదేర నతితుములతమధమామికాతమ్మటపటహభేరికాశంఖ కాహళ వేణువీణాద్యనవద్యసముద్యదమోఘనిర్ఘోషణంబులుదిక్కులబిక్కటిల్ల। మంజులంపుటపరంజిపళ్ళెరంబులబరిణయక్రియాసముచితాభంగమంగళద్రవ్యంబులుబూనివివిధప్రసాధనప్రభాప్రదీప్రతరవిప్రసువాసినీకాంత లేకాంతకాంతంబుగగ్రంతగొనిపురోభాగంబుననురాగంబున రాగనకుంతితోతరంరనుతరంతులగుచు వేదవిద్వద్వతంసంబులుసజలజలధరధ్వానగంభీరభాషాఘోషణంబులనస్తోకశ్రుతిస్వస్తులుచ్చరింప నందందవందిమాగధవైతాళికవారంబు దారవిరావంబులు ద్వైవారకైవారంబులాచరింప భరతకళాప్రవీణగణికావధూమణులుపొంగితాభంగురమృదంగదింధిమిధ్వనిపరంపరాపురస్సరంబుగదారమంద్రమధ్యమత్రిస్థానజ్ఞానేరితగానపూర్వకంబుగనఖర్వపర్వధూర్వహతా మృదుచరణకరకమలవిన్యాసంబులతోనఖండతాండవంబు మెండుకొనంజేయనమేయక్షణనిరీక్షణసమాయాతాపారపౌరజానపదప్రధాన ప్రజాబృందంబుసందడులజడియుదండనాథులభుజాదండమండితమండలాగ్రప్రకాండంబుల తళత్తళలు చూపరులచూపులకుమిరుమిట్లుగొలుప బాంధవానుబంధధురంధర వసుంధరాపురందరకుమారకపరస్పరోక్షిప్తంబులగునిద్దంపుగందవొళ్ళెల్లెడనల్లెడల వడువునడరింప నింపునగృతవర్మాక్రూరాద్యాత్మీయ ప్రియసఖులుబంగరుబెత్తంబులబరాబరులొనరింప నిట్లపరిమితవైభవుండై గోవిందుండమందానందంబుననిమ్నానందనుమందిరంబుడాయఘంటాపథంబునజనుదెంచు నెడ॥ మ॥ తనుసిమాకారణమీసడించినజడున్దండింపకీభంగిమై। త్ర్యనుబంధంబుసదాస్థిరంబుగదదీయప్రార్థనక్స్వీకరించెనహో యిట్టిమహామహుండుకలడే చింతింపనంచబ్జలోచనుపైగ్రొవ్విరిసేసజల్లిరిపురీసౌధాగ్రపుణ్యాంగనల్॥ ఉ॥ యాదవభర్తనిమ్నసుతునానతిదత్ప్రియబంధుముఖ్యులా। మోదముతోగృతాదరణపూర్వముగానెదురేగుదెంచిమ। ర్యాదగదమ్ముదోడుకొనిరాజనుదెంచితదీయశోభనా। సాదనికేతనంపుమొగసాలశతాంగముడిగ్గివేడ్కతోన్॥ క॥ గవనిగలకాకలీరుతి। ధవళంబులుబాడుచున్ముదంబునముత్తై। దువలిడుశుభనీరాజన। నివహంబులంగీకరించి

నెరిహాళాయలెసగన్॥ఉ॥ నిండినభక్తితోనపుడునిమ్నజమంత్రివరుండొకండుపై।
దండయొసంగనెయ్యమునదాగురుసోదరముఖ్యబంధుయు। క్తుండయిమందమం
దగతిగొన్నిబవంతులతిక్రమించికృ।ష్ణుండరుదెంచెచిత్రమయసుందరభర్మవివా
హశాలకున్॥క॥ ఆలీలనువైవాహిక।శాలకుజనుదెంచినిమ్నజాతానుమతిన్।సా
ళీకాత్మజుడుతపనీ।యాలఘుపీఠంబునందునధివసియించెన్॥చ॥పనివినిపేరటాండ్రె
అమిబాటలుబాడుచుగర్గునాజ్ఞమై। ననఘగుణాభిరామనుముఖార్జవనిర్జితసోమని
మ్ననం।దనతనయాలలామతనుధాళధళీపరసీమసత్యభా। మనుగొనితెచ్చిరార్య
జనమండలపూర్ణవివాహవేదికిన్॥క॥ సత్రాజిత్తుండంబుజ। నేత్రలుప్రతిసీరబట్ట
నిఖిలమహావా। దిత్రంబులుఘోరకొనం। బత్రివరధ్వజునకొసగెమధుపర్కం
బున్॥చ॥బహుప్రతిబంధమయ్యెదెరపద్మముఖింగనకుండనంచహో। యహర
హమున్నమస్తభువనౌఘములన్నిజదర్శనాప్తికై। తహతహనొందజేయుహరి
దాదరుణింగనరామినంతలో।దహతహనొందసాగనికతన్వివిలాసమునెన్నబో
లునే॥మ॥ దనుజారిశ్వశురుండనైతిననియాత్మంబొంగుచున్నిమ్ననం। దనుడాత్మ
ప్రియయిచ్చుక్రొంబసిడినిద్దాగిండిపన్నీటగాం।చనపాత్రన్జరణాబ్జముల్గడిగి
యాస్థందారవోసెన్గన। త్తనుభాధన్యననుంగుకన్యద్రిజగద్వ్యాపారికిన్శౌరి
కిన్॥చ॥ గొలగొలలాడుచున్గుములుగూడినధూటులుగొందరిచ్చతో। గెలకుల
జేరినిక్కిదిలకింపుచునుండగగొందరింతులిం। పలరగనవ్వధూవరులనాణికదాని
మెరుంగురంగుల।గ్గలమగుపట్టుపావలపుటికల్గదియించిరుదంచితోన్నతిన్॥ క॥
చెలువల్జవనికవంపగ।గలికిజగానెమ్మొగంబుగానంబడియెన్।లలితశరజ్జలదా
వృతి। వెలువడివిలసిల్లుచంద్రబింబమువోలెన్॥చ॥ హరిగజగామినింగనియయారె
ఝొయారిముఖాంబుజంబునన్।సరవినిరీక్షణభ్రమరజాలములొప్పభుజామృణా
ళికల్।నెరయనురోజకోకములునికరనఖాంకురకోరకావళుల్।బరగనెసంగునీ
తరుణిపద్మినిగాదెయటంచునెంచుచున్॥ఉ॥ భావిసమాగతప్రణయవైరహరా
నునయాభిసూచకం। బైవెలయంద్రపానతముఖాంబుజమెత్తికరంబుసాచికొ।
ప్పావలినుండితీసిగళమందునగర్గబుధోక్తమంత్రసం। భావనశౌరికూర్మిమెయి
మంగళసూత్రముగట్టెనిత్తికిన్॥చ॥కరముశుభకరంబెపయిగావలెనంచిరువా
గువారుద।మ్మిరవురనెచ్చరింపుచువహించుహిరణ్మయపాత్రలందుని।ర్భరమగు
మూక్తికోత్కరపరంపరదోయిటగ్రుచ్చిమెత్తియెం। దొరుదలబ్రాలుబోసుకొ
నిపుష్పళికన్హరియుంగుమారియున్॥శా॥భావ్యంఘ్రిగ్రహణక్రియాదిమముగా
బాదద్వయంబట్టెదె। కృష్ణుండచ్యుతుడింతిసన్నైకలుద్రొక్కించెన్భవిష్యద్వితా

నవ్యాహూతిసూచకంబుగనిశానాథాస్యతోడఁ మణి। దిష్ట్యాత్రీవసించి వ్రే
ల్చెశిఖిభక్తిన్లాజముఖ్యాహుతుల్ ॥ మ ॥ జలవాంతంబుననొప్పుజంచలగతిఁ
శ్యామాచలోపాంతమం। దలిజ్యోతిర్లత లీలనీలమణిపాంతంబొల్చు క్రౌంజా
ళువా। తళుకుఁ దీపవలెఁ మృగీమదము చెంతంగ్రాలుకాశ్మీర రే। ఖలలింకృష్ణు
నిపజ్జసత్వరహిమై గన్పట్టెనప్పట్టునఁ॥ సీ॥ పరిణమించిరిగర్గ గురుకులగ్రామ
ణి పరికరలితపటాగ్రబంధగరిమ । గావించిరతికౌతుకమునప్రదక్షిణత్రయి
నాహుతిజ్వలత్పావకునకు। నంగీకరించిరి శృంగారిణీదత్త రాజోపచారనీరా
జనములు । ధరియించిరుర్వరామరసమూహార్పిత సాశీర్వచోమంగళాక్షత
ములు । స్వీకరించిరితమతమపేళ్ళబంధు । వితతులుబుధోధచేజదివించువీళ్ళ।
మొక్కిరుభయప్రసూపితృముఖ్యవృద్ధ । సకలబంధుద్విజాళికి సతియుబతియు॥
మ॥ వెలయఁ రెండుతెరంగులఁ గలదోరల్ వియ్యంపుమర్యాదశో । భిలప్రౌ
ఢోక్తుల నొంధఁడుంబలుకుచుఁ బెండ్లిల్లనాళింపుసొం। పులబువ్వానుభుజించి
కప్పురపుతాంబులచ్ఛటాచర్వణం । బులుగావింపుచునిష్టకేళికలనా మోదాత్మ
లైరందరుఁ ॥ మ ॥ స్వసుతాకృష్ణులకుఁ వివాహమహమంచ్ఛచ్చేషహోమ
క్రియై। కసమాప్తింబరిపూర్తినొందుటయునా గానీశగేహప్రవే। శసమగ్రా
ర్తినతాశ్యమైవనరునా సత్రాజితిఁ స్వాంకమ । న్యసమాసీనను జేసిగద్గదిక
సత్రాజిత్తుతానిట్లనుఁ॥

క॥ తల్లీసమస్తసుగుణమ। తల్లీనాయల్లుడయ్యె దనుజారిజగ। త్వల్లభు
డుయఘుష్మదుదయము। వల్లనహోమతుకలంబు పావనమయ్యెన్॥ క ॥ పుట్టిని
లుగల్గునెడసిరి। యిట్టులఘగునత్తవారి యిల్లొదవెజగ । త్పట్టభద్రుండు దేవకి।
పట్టిమగండయ్యెనీకు భాగ్యముగాదే॥ ఉ ॥ ఉమ్మరనేలనమ్మయొక యూరిన
యుంటమికాదటమ్మమా । యమ్మభవత్సుఖంబనయమూరయుచుండెదమమ్మనీ
కభీ। ష్టమ్మగుసొమ్ములెల్ల ననిశంబొనగూరిచిపుత్తునమ్మవే। గ్రమ్మరసిమ్మనిచ్చటి
కిగయికొనివచ్చెదనమ్మపుత్రికా॥ వ ॥ అనియూరడంబల్కి వెండియునిమ్మెఱుం
డట్లనియె ॥ సీ ॥ పాంసులగానివిశ్వంభరాసతిలీలబంకమొందని సురాపగవిధ
మున। వ్రేళ్ళజూపబడకొప్పిన యరుంధతిపోల్కి చపలగానిసరోజసదనభంగి।
పుణ్యజనఘ్నుతబొరయని సతిరేవస్వపతినిపీడని సంజ్ఞపగిది। పెనిమిటిపిడిధాత్రి
జననిసీతవిధానమాట పాల్గానిబ్రాహ్మణికరణి । శాంతినచ్యుతసచ్చర్యసంప
దదయనతిశయప్రేమ సాధ్వితనతులచతుర । వచనరచనలబాగడొందవలెగద
మ్మ। తనయయత్తింట సువివేకతానిరూఢి॥ చ ॥ పరగనినాభినందనయొపద్మిని

భూర్యనురాగదృష్టితో। వరసహకారవృత్తి నెడబాయని దేకలకంఠి ప్రియా।
స్థిరసుమనోవికాసమును జెందిన దేలతకూనసన్మనో। హరుకళలంటిగూడున దె
యారయశ్యామికదమ్మకోమలీ॥ సీ॥ ప్రాణేశుతోడ నేపట్టున నెదిరించి మారు
పల్కకుమత్తమామలకును। సమధికశ్రద్ధనిచ్చలు సేవసేయుము బావమరుదులప
ట్లభయముకలిగి వర్తింపుమింపలర సపత్నులతో మైత్రిసల్పుము తన్నుకతవదినె।
మరదండ్రచోటసన్మార్గంబు పాటింపుమెలమి నేరాండ్రతో గలసిమనుము। బాం
ధవులయందు ననురక్తిబూనుమి ప్రాణప్ర। వరులయందుననతిభక్తి నెరపుమాత్మ।
నెట్టిసంపద్విపత్తులనేనిధర్మ। తత్పరతమానకమ్మ నాతల్లికాన॥క॥ అనిబుద్ధిగ
ఱపిప్రేమం। బునబెక్కరణంబులనుసుపుత్రికినిడిపు। త్రిని దేవకికిన్ వసుదే। వున
కున్। మ్రొక్కించితమిదవుల్కాననిమెన్॥మ॥ భగవంతుంగలుషాపహర్తను
జగద్భర్తన్ జగత్కర్తనే। సుగుణాత్ముల్ గనిరట్టిలోకవిదితుల్ సుశ్లోకులైనట్టిమీ
దగువియ్యంబులభించెనాకు నహహాధన్యుండనైతిం బ్రియం। బుగనైకొండనియొ
ప్పగించెనుపథాపూర్వంబుగానాత్మజన్॥

ఉ॥ ఆవిధిబుత్త్రి దేవకికినవ్వసుదేవునకొప్పగించి। చింతావృతబాష్పవార్ధ్న
యనమైతనకున్ వెసమ్రొక్కుపుత్రికిన్। దీవనలిచ్చితద్విరహదీనతనుండినమాను
గారిచే। నావనజాక్షుడింపెసగ నానతిగైకొనిసంభ్రమంబునన్॥ శా॥ సంతోషి
భవదాత్మవర్గముప్రస్థానంబు సేయించియే। కాంతోద్ధర్షితవృత్తిదానునుశ
తాంగంబెక్కగా నేస్తపుం। గాంతల్వేడుకసత్యనాహరిశతాంగంబందునెక్కిం
పగా। నెంతేవెల్వడిశౌరిబాంధవచమూబృందంబులే తేరగన్॥ సీ॥ ఉపరిప్రదేశ
సాంద్రోన్నమితస్వచ్ఛముక్తాతపత్రసమూహమెసగ। సూరెలగజతురంగానో
హములైయాత్మబంధువర్గంబులుబలసిరాగ। ప్రాగ్భాగమందునపాణివిన్యాసాదు
లడరలాసికలులాస్యంబుసలుప। రోదసీకుహరంబుభేదిల్లభోరునవివిధవాద్యధ్వ
నుల్ విస్తరిల్ల। దండనాథులుహుంకృతిధ్వనులసంద। డులనడంచుచునెల్లరండునడి
పింప। కృష్ణుడానందవిభవవర్ధిష్ణుడగుచు। మందగతిప్రవేశించెమందిరంబు॥ వ॥ ఇ
వ్విధంబునగృశావలగ్నతో శుభలగ్నంబున గృహప్రవేశమంగళంబంగీకరించిగృ
హప్రవేశోత్సవంబుసేయించి వందిగాయకనాటకజనకోటులకు మంత్రిసామం
తదండనాథయూథంబులకు హితప్రియబాంధవవర్గంబులకు తత్తదుచితప్రకా
రంబుల నవీనతారహారజాంబూనదాంబరమణికాంచన వస్తువాహనాద్యభీష్ట
దానంబులసత్కరించెనంత॥ చ॥ తరుణియుసుందరాంగియునుతన్వియు రామ
యునాటచేగదా। ధరుడెదసత్యభామ మెడతద్దయుగూరిమిహత్తియుత్తలో। దరి,

యెపుడేమిగోరునదితప్పక యప్పుడె సంఘటింపుచా। గరితను గూడి కామితసుఖంబులనొందుచునుండె నెంతయున్॥ సీ॥ రుక్మిణీవంభసరోజినీ హేళిసత్యా కేతకీపయోదాగమంబు। జాంబవతీవశాసమదేభమరల్కన్యామల్లికానిదాఘావసరము। లక్షణోత్పలినీకళానిధిమిత్రవిందాసరసీవిశదచ్ఛదంబు। భద్రాతరంగిణీపాదోసిధానోత్తమముసుదంతాపుష్పమాలికాళి। సకలగోపవధూటీమృషావనీప। రంపరామధుమాసమైప్రబలసౌఖ్య। వైభవంబనుభవించెనవ్వాసుదేవు। డఖిల లోకావనపరాయణాత్ముడగుచు॥క॥ అనియేతదఖిలచరితము।వినయంబునసూతుడార్యవినుతగుణుడు తె। ల్పినవినిహర్షోత్కర్షం।బున దేలిరిశౌనకాదిమునికులవర్యుల్॥క॥ ఈమనిశమంతకోదం।తముచదివినవినినవారికినన్ వారలకున్। సమధికశుభవిభవంబులు।కమలదళాక్షునికటాక్షగలనలభించున్॥ఆశ్వాసాంతము॥ఉ॥ యక్షపమిత్రమిత్రతనయస్మయశిక్షణదక్షదక్షయ। జ్ఞక్షయకారికారిపరిషజ్జయధామనికామకామధ।గ్వీక్షణహేతిహేతినిధివిధ్వనిలాప్తవిలోకలోకసం।రక్షణధీరధీరవనరంజనమాధవమాధవప్రియా॥క॥ కటకదురగరజతాచల। కటకచరసముచ్ఛకీర్తికలితాఖిలది।క్కటకపటుశరవిదారిత। కటకత్రయదనుజవారకలుషనివారా॥తోటకవృత్తము॥ కరుణావరుణాలయకర్మరహ్ప। స్ఫురణాశరణాగతసంస్కృతిత। మ్యరుణాయరుణద్యుతిహాగిజటా। భరణాభరణాశనపాండువిభా॥

గద్య॥ ఇతి, శ్రీమత్కవితాచతురతురగా వెంకయామరవాది
రామయోభయకవి ప్రణీతంబయిన శమంతకోదంతం
బను మహాప్రబంధంబునందు సర్వంబును
తృతీయాశ్వాసము సంపూర్ణము.

